# ఆంధ్రపత్రిక





The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 21 FRIDAY 22nd APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# అడ్మిరల్ నిమిట్జ్ భారతదేశాగమనం వాయిదా పడడానికి కాశ్మీర్ ప్రధాని పట్టుదలే కారణం

## అవహారఒడంబడికసంతకం కావాలని అబ్దుల్లా సూచన

### కాశ్మీర్ కమీషన్ కార్యకలాపం క్లిష్టమైనట్లు ఢిల్లీవర్గాల భావన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: కాశ్మీరు జనవాక్య నిర్ధారణ కార్యక్రమ నిర్వహణ అధికారి అడ్మిరల్ నిమిట్జ్ భారతదేశాగమనం వాయిదా పడిందను వార్త ఇక్కడ అధికారవర్గములకు ఎట్టిఆశ్చర్యము కల్గించలేదు. సమితి నియామకమును కాశ్మీరు ప్రధాని గుర్తించి, తిరిగి అడ్మిరల్ నిమిట్జ్‌ను జనవాక్య నిర్ధారణాధికారిగా నియమించినగాని ఆయన పనిప్రారంభించుటకు వీలులేదు. ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వములు అవహార ఒడంబడికను అంగీకరించి పత్రంపై సంతకములు చేసినగాని తాను జనవాక్య నిర్ణయాధికారి నియామకమునకు సంబంధించిన ఉత్తరువును జారీచేయునని షేక్ అబ్దుల్లా విస్పష్టము చేసియుండెను. ఈ పరిస్థితులలో నిమిట్జ్ ప్రయాణం వాయిదాపడడం సహజమే. (అడ్మిరల్ నిమిట్జ్‌ను షేక్ అబ్దుల్లా నియమించవలెనని భద్రతామండలి తీర్మానము స్పష్టంగా నిర్ణయించెను.)

అడ్మిరల్ నిమిట్జ్ కార్యాలయములో విచారించగా పరిస్థితిప్రస్ఫుటం కానందున ఆయనప్రయాణం వాయిదాపడినట్లు తెలుస్తున్నదని రాయిటర్ విలేఖరి లేక్ సక్సెస్ నుండి తెలుపుతూఉన్నాడు.

అడ్మిరల్‌ను ఎరిగినవారు ఆయననిర్ణయాన్ని హర్షిస్తున్నారు. ఉభయ అధినివేశాలు అవహారఒడంబడికపత్రంపై సంతకాలు చేసినవారని, ఉభయపక్షాలూ తనతో మనస్ఫూర్తిగా సహకరింపగలవను విశ్వాసం ఆయనకు ఏర్పడేవరకు నిమిట్జ్ భారతదేశంరారని వీరు తెలుపుతూ ఉన్నారు యుద్ధవిరమణ ఒడంబడిక షరతులలో అంతర్గర్భితంగాఉన్న విధులను పాకిస్తాన్ అంగీకరించి అమలుచేయునట్లు కాశ్మీర్ కమిషన్ చేయలేకయున్న పరిస్థితుల్లో నిమిట్జ్ ముందుగావచ్చి ఇరకాటంలో పడరాని వారంటున్నారు. తనప్రయాణాన్ని వాయిదావేసుకుంటూ నిమిట్జ్ చేసిననిర్ణయం ప్రభావం కమీషన్‌పై కన్పించగలదని ఇక్కడ భావిస్తున్నారు.

భారతదేశం మాత్రం తాను చెప్పదలచినదంతా చెప్పివేసింది. ప్రధానసూత్రాలపై తన వైఖరిని, పూర్వపు నిర్ణయాలను, మార్చుకొనడానికి వీలులేదు. భారత ప్రభుత్వం సందిగ్ధంగా స్పష్టంచేసింది. ఆజాద్ కాశ్మీర్ పటాలమును విచ్ఛిన్నం చేసి, సైనికులను నిరాయుధుల చేయక తప్పదు దొంగచాటుగా తిరుగుబాటుదారులు, దుండగీళ్లు కాశ్మీర్లోయలో ప్రవేశింపకుండా నివారించేందుకు భారత సేనలు సంస్థానంలోని కీలక ప్రాంతాలను ఆక్రమించక తప్పదు. ఏ రూపంలోనూ భారత ప్రభుత్వం ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వాన్ని గుర్తింపదు. పాకిస్తాన్ ఆక్రమణలో వున్న సంస్థాన ప్రాంతంలో శాంతిని [illegible] స్థానికాధికారులు తమపైన [illegible] బాధ్యతపైననే, మాత్రం భారత ప్రభుత్వం అంగీకరిస్తుంది. సైనికపటాలాలు ఇరుపక్షాలవీ సరిసమానంగానే వుండాలనే పాకిస్తాన్ ప్రతిపాదనను భారత ప్రభుత్వం తిరస్కరించింది. వాస్తవాని కిది చాలా విపరీతమైన కోర్కె.

అవహార ఒడంబడికపై సంతకాలు చేయించడానికి ముందు పాకిస్తాను యుద్ధ విరమణ ఒడంబడిక షరతులను అమలు చేయునట్లు చూడవలసిన బాధ్యత కాశ్మీరు కమిషన్‌పైన ఉన్నది. నిమిట్జ్ నిర్ణయం ఈ పరిస్థితిని ఒక కొలిక్కి తెచ్చిందని చెప్పవచ్చు.

### పాకిస్తాన్ సమాధానం

రావల్పిండి, ఏప్రిల్ 10: కాశ్మీరులో ఉభయపక్ష సేనలును యుద్ధమును విర

(8-వ పేజీ చూడుడు)



భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ లండన్ వెళ్తూ ఢిల్లీనుండి బొంబయి వచ్చినపుడు 19 వ తేదిన శాంతక్రజ్ విమానాశ్రయంవద్ద బొంబయి మేయరు, షెరిఫ్, ఇతర మంత్రులు స్వాగతం ఇచ్చారు.

## రష్యాలో అమెరికా రాయబారి

వాషింగ్టన్, ఏప్రిల్ 20: అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ నేడు, రష్యాలో అమెరికా రాయబారిగా, అలెన్‌కర్క్‌ను (68 వయస్సు) నామినేటు చేసెను. ప్రస్తుతం కర్క్ బెల్జియంలో అమెరికా రాయబారిగా పనిచేస్తున్నాడు.

## పోరాటాన్ని తీవ్రతరం చేయడానికి బర్మా విప్లవకారుల ప్రయత్నం

### ప్రోమ్‌లో తిరుగుబాటుచేసిన వివిధ పక్షముల నాయకసమావేశం

రంగూను, ఏప్రిల్ 20: మాండలే కు ఉత్తరంగా 160 మైళ్ల దూరాన నదిఒడ్డున గల కథా అనే పట్టణంవద్ద గల ప్రభుత్వ ఠాణాపై, తెల్లముతా వాలంటీరు నాయకత్వంకింద 60మంది తిరుగుబాటుదార్లు దాడిచేశారు. 9 నిమిషాలు యుద్ధంజరిగిన మీదట ఠాణా పట్టుబడింది. అందులోని ఆయుధసామగ్రి దాడి ముఠావశమయింది. ఆప్రాంతానికి అదనపు ప్రభుత్వబలాలు సంపబడ్డాని.

బర్మాప్రభుత్వ విమానాలు దక్షిణ బర్మాలోని రెండుజిల్లాలలోగల తిరుగుబాటుదార్ల కేంద్రాలపై దాడిచేసినవి. తిరుగుబాటుదార్లకు చాలా ప్రాణనష్టం జరిగినట్లు భావించబడుతున్నది.

### తిరుగుబాటుదారు నాయకుల సమావేశం

ప్రజావాలంటీరు సంస్థవొక్క తెల్లముతా, ఎర్రజెండా కమ్యూనిస్టు, తెల్లజెండా కమ్యూనిస్టు సంస్థల మూడింటి నాయకులు కలిసి అతిముఖ్యమైన సమావేశం జరిపినట్లు ఇక్కడికి అనధికారవార్తలు చేరినవి.

ఈ మూడుసంస్థలవు నాయకులైన బోహ్మోహన్, థాకిన్‌సో, థాకిన్ తాన్‌తూన్ అనేవారలు, రంగూనుకు ఉత్తరంగా 160 మైళ్ళలోఉన్న ప్రోమ్ అనే పట్టణంవారి కేంద్రస్థానంలో కలుసుకొని, కలిసి పని చెయ్యడానికి ప్రతిజ్ఞలోనూ తిరుగుబాటుదార్ల ముఠాలు ఏర్పాటు చేయడానికి మార్గాలు ఆలోచించారట.

థాకిన్‌థాన్‌తూనుకు అనుచరుడుగా పనిచేస్తున్న భారతీయ కమ్యూనిస్టు గోషాల్ ఈ చర్చలలో పాల్గొన్నారట.

మాండలేలో ఉన్న తెల్లముతా తిరుగుబాటుదార్లను పట్టణం బయటికివచ్చి యుద్ధం చేయమని సవాలుచేస్తూ నిన్న బర్మా ప్రభుత్వసేనలు [illegible] విచ్చినవట.

ఫాసిస్టు వ్యతిరేక ప్రజా స్వాతంత్ర్య సేనలో అధిక సంఖ్యాకులుగా ఉండిన తెల్లముతా వాలంటీరులు గత ఆగస్టులో సంస్థనుండి వెళ్లగొట్టబడి, థాకిన నూ

(2-వ పేజీ చూడుడు)

## కలకత్తాకు త్వరలో ప్లేగు వినాశనం!

కలకత్తా, ఏప్రిల్ 20: కలకత్తా నగరానికి త్వరలో పెద్ద వినాశనం రావచ్చునని పశ్చిమబెంగాల్ ప్రభుత్వం నియమించిన ప్లేగ్‌వ్యాధి నిపుణులసంఘం హెచ్చరించినది.

ప్లేగ్‌వ్యాధి నగరంలో ప్రబలుతున్నందున ప్రస్తుతం గ్రాంటు చేయబడిన 9 లక్షల రూ. స్కీము చాలదనీ, మొదట అనుకొన్నట్లు 25 లక్షల రూ. స్కీముతో ప్లేగ్‌వ్యాధిని నిర్మూలింప సమకట్టవలెననీ, దీనికై ఒక శాశ్వత సంఘమును ప్రభుత్వం స్థాపించవలెనని నిపుణులకమిటీ ఇటీవల ఒక సమావేశం జరిపి ప్రభుత్వమునకు సిఫార్సులు చేసినట్లుకూడా తెలియుచున్నది.

## ప్రపంచపరిస్థితి అధ్వాన్నంగా ఉన్నా అంతాచక్కబడునని నెహ్రూ విశ్వాసం

### లండన్ విమానాశ్రయంవద్ద భారత ప్రధానమంత్రికి ఘనమైన స్వాగతం

హారో విమానాశ్రయము, లండన్ ఏప్రిల్ 20: నేటి రాత్రి 'మలబార్ ప్రిన్సెస్' అను ఎయిర్ ఇండియావారి అంతర్జాతీయ సర్వీస్ విమానములో భారతదేశమునుండి యిచ్చటికి విచ్చేసిన పండిత జవహర్లాల్ నెహ్రూగారు విమానమునుండి బయటికి అడుగు పెట్టిన సమయమున అతి ఉల్లాసముగాను, ఉత్సాహంగాను ఉన్నట్లు కనిపించెను, విమానమునుండి నిచ్చెనమీదుగా ఆయన దిగుచు ఒక్క నిమిషమాగి క్రింద తనకు స్వాగతమొసంగ వేచియున్న అధికారులు పత్రికా ప్రతినిధులు మున్నగువారి బృందము నుద్దేశించి కరచాలనము గావించెను.

ఆయన తెల్లని గాంధీటోపీ, గోధుమ వన్నె కోటు ధరించియుండెను. సుప్రసిద్ధులు భారతీయులును, ఇతరులును వెంట నడువ భారత హైకమీషనరు కృష్ణ మీనన్ గారును, కామన్వెల్తు సంబంధ వ్యవహారముల శాఖ బ్రిటిష్ మంత్రి ఫిలిప్ నోయెల్ బేకర్ గారును నెహ్రూగారిని స్వాగతమిచ్చి [illegible] పండితునకు కృష్ణ మీనన్, నోయెల్ బేకర్ కరములను కరముతో గ్రహించి [illegible] సంభాషించెను. నెహ్రూగారిని ఆహ్వానించుటకు విమానాశ్రయమునకు వచ్చిన వారిలో మూడు భారతరక్షణ సర్వీసుల

2వ పేజీ చూడుడు

## ముస్లింలీగ్ నుండి ఆరుగురు సరిహద్దు శాసనసభా సభ్యుల బహిష్కరణ

### కాంగ్రెస్‌తో చేతులుకలిపారని కార్యవర్గారోపణ

పెషావర్, ఏప్రిల్ 20; సరిహద్దు రాష్ట్ర ముస్లింలీగు కార్యవర్గంవారు గత రాత్రి సమావేశమైనప్పుడు అసెంబ్లీలోని కాంగ్రెస్ పక్షంతో చేతులు కలిపిన 6 గురు ముస్లింలీగు ఎం. ఎల్. ఏ. లను రాష్ట్ర ముస్లింలీగు నుంచి 6 సం. ల పాటు తొలగించుటకు ఏకగ్రీవంగా నిర్ణయం చేశారు. ఏడవ ఎం. ఎల్. ఏ. విషయాన్ని వచ్చే సమావేశం వరకు నిలిపి వేయబడింది. ఇదేను స్వాతంత్ర్య అభ్యర్థి. 6 గురు ఎం. ఎల్. ఏ. ల పేర్లు సర్దార్ అసద్‌ఖాన్, ఆర్బాబ్ మహమ్మద్ షరీఫ్, పీర్ అబ్దుల్ లతీఫ్ జకోరీ, సుల్తాన్ హసన్ ఆలీ, సర్దార్‌ఖాన్, నవాబ్ మహమ్మద్ జఫర్ ఖాన్ ఏడవ ఎం. ఎల్. ఏ. పేరు మెయిన్ ముస్తాన్‌షా ఈక్రింది కారణాలకలనపై ఆరుగురు ఎం.ఎల్.ఏ.లపై రాష్ట్ర ముస్లింలీగు కార్యవర్గం చర్యతీసుకొంది.

(1) అసెంబ్లీలోని కాంగ్రెస్‌పక్షంతో వీరు చేతులు కలిపారు. (2) కాశ్మీరు సమస్య మొదలైనవాటిని గురించి పాకిస్తాన్ ప్రజలకు లాభం చేకూర్చాలనే ఉద్దేశ్యంతో వీరు సరిహద్దు రాష్ట్రంలో లీగు మంత్రివర్గాన్ని పతనంచేయాలని చూస్తున్న పాకిస్తాన్ వ్యతిరేక, లీగు వ్యతిరేక శక్తులతో కుట్రపన్నినారు. (3) పాకిస్తాను వ్యతిరేకంగా వారు పత్రికలలో చేసిన ప్రకటనలు పాకిస్తానుకు, ముస్లింలీగు సంస్థానికి తీవ్ర హాని కల్గించినవి.

వారిపై క్రమశిక్షణ చర్య ఎందుకు తీసుకోరాదని రాష్ట్ర పార్టీ వెంటనే వారికి పదిరోజుల గడువిచ్చి నోటీసు పంపింది. దీనికి వారు పంపిన సమాధానాలలో చర్యలపై పశ్చాత్తాపం కూడ తెలుపలేదు.

## బ్రిటిష్ యుద్ధనౌకలపై చైనాకమ్యూనిస్టులకాల్పులు

### 17 గురిమరణం: 20 మందికి తీవ్రంగా గాయాలు

నాన్‌కింగ్, ఏప్రిల్ 21: నాన్‌కింగ్, షాంగ్‌హై నగరముల మధ్య యాంగ్సీ నదిలో ప్రయాణము చేయుచున్న బ్రిటిష్ యుద్ధనౌక అమెథిస్టుపై ఉత్తర గట్టునుండి చైనా కమ్యూనిస్టు సేనలు కాల్పులు జరుపుటవల్ల, నౌకలో నున్నవారిలో 17 గురు మరణించిరని 20 మంది తీవ్రముగా గాయపడిరని, షాంగ్‌హైలోని బ్రిటిషు నౌకాదళాధికారులు గతరాత్రి ప్రకటించారు. (ఈ నౌకపై కాల్పులు జరిగినవార్త అందినంతవరకూ నిన్నటి పత్రికలలో ప్రచురించినాము.)

అమెథిస్టు రక్షణార్థం నాన్‌కింగ్ నుంచి కడువేగముతో సాగిపోతున్న 1710 ట. బ్రిటిషు డిస్ట్రాయర్ కాన్సార్టుపై గూడా కమ్యూనిస్టుసేనలు కాల్పులు జరిపినవి. కాన్సార్టు, కమ్యూనిస్టులపై ఎదురు కాల్పులు సాగించింది. ఈ సంఘర్షణలో కాన్సార్టు తాలూకు 25 గురు నష్టపడ్డట్లు, నౌక కొంత దెబ్బ తిన్నట్లు తెలుస్తున్నది.

యాంగ్సీనది కిరువంకల, కమ్యూనిస్టు కొమింటాంగ్ సేనలు భారీయెత్తున యుద్ధానికి సన్నద్ధమై యుండగా 1375 టన్నుల బ్రిటిష్ యుద్ధనౌక ఎమెథిస్ట్ ఉభయసేనలమధ్యగా నదిపై షాంగ్‌హైనుండి నిన్న నాంకింగ్‌కు బయలు దేరింది. షాంగ్‌హై నాంకింగ్‌ల మధ్య మార్గంలో ఉండగా ఉత్తరపుగట్టునుంచి, కమ్యూనిస్టుసేనలు కాల్పులు జరిపినవి.

### రాష్ట్రపతి పట్టాభిగారు పత్రికా విలేఖరులతో జరిపిన గోష్ఠి వివరాలు

—3 వ పేజీలో

## కమ్యూనిస్టు సేనలు యాంగ్సీనదిని దాటినవి

నాన్‌కింగ్, ఏప్రిల్ 21: నాన్‌కింగ్ నగరమునకు నైరృతి దిశగా 80 మైళ్ళదూరంలో ఒకచోట, చైనా కమ్యూనిస్టుసేనలు యాంగ్సీనదిని దాటినవి. దక్షిణ గట్టు వెంబడిగ సాగివస్తూన్న యీ కమ్యూనిస్టుసేనలు నాన్‌కింగ్ నగరంపై భీషణముగా కాల్పులు సాగించుచున్నట్లు తెలియవచ్చినది.

చైనామంత్రివర్గ సమావేశం ముగిసినది. కమ్యూనిస్టుల సంధి షరతులకు మంత్రివర్గం ఒక సమాధానమును తయారు చేసినట్లుగూడ తెలియవచ్చినది.

### మరికొన్ని చైనావార్తలు

—3 వ పేజీలో

కాల్పులవల్ల తీవ్రంగానష్టపడి ఒకచోట మెరక పట్టింది; అమెథిస్ట్‌ను రక్షించుటకు నాన్‌కింగ్‌నుంచి బ్రిటిష్‌డిస్ట్రాయిర్ కాన్సార్టు షాంగ్‌నుంచి క్రూయిజర్, లండన్ బయలుదేరినవి కాన్సార్ట్ నౌక, యాంగ్సీ నదిలోని రోజ్ దీవికి ఆవలగా 80 మైళ్ల దూరంలో అమెథిస్ట్‌ను చూచింది.

అమెథిస్ట్ మూడుపంతులు నీళ్లలో మునిగిపోయిందని నాన్‌కింగ్‌నుంచి వచ్చినవార్తలలో యేమాత్రమూ సత్యములేదని తేలింది. ఎమెథిస్ట్‌పై కమ్యూనిస్టుల కాల్పులు జరుగుతుండగా దక్షిణగట్టున చైనా సేనలు చూస్తూ కూర్చున్నారట.

### బ్రిటిష్ నౌకాధికారుల ప్రకటన

నౌకపై నున్నవారే నౌకను మరమ్మతు చేసి, తిరిగి ప్రయాణానుకూలమగునట్లు చేయుచున్నారని, క్రితంరాత్రి 10 గంటలకు 'అమెథిస్ట్' రేడియోవార్త పంపినట్లు షాంగ్‌హైలోని బ్రిటిష్ నౌకాదళాధికారులు ప్రకటించారు. మధ్యాహ్నం వరకూ నౌకపై కమ్యూనిస్టులు మధ్యరకపు ఫిరంగులతో కాల్పులు సాగించుచునే ఉన్నారని, వీరు తెల్పిరి.

ఉదయం 6-15 గంటలకు వచ్చిన వార్తనుబట్టి అమెథిస్ట్ [illegible] నదిపై

(8-వ పేజీ చూడుడు)

## "కమ్యూనిస్టుల షరతులు అంగీకరిస్తే పూర్తిగా దాసోహమన్నట్లే"

### చైనా శాసనసభలో ప్రధాని ప్రకటన

నాన్కింగ్, ఏప్రిల్, 21: రాజధానిని వదిలిపోవడమా లేదా అనే విషయాన్ని చర్చించేందుకు ప్రభుత్వ, రాజకీయ నాయకులు సమావేశం అవుతూ ఉండగా నేడు కమ్యూనిస్టు శతఘ్నిదళములు నాన్కింగ్ సమీపంగా యాంగ్సీనది దక్షిణ తీరంపై మరఫిరంగులను నిర్విరామంగా ప్రేల్చడం ప్రారంభించారు.

చైనా ఎగువ శాసనసభ రహస్య సమావేశం జరిపి సభాధ్యక్షుడు కాల మాసన్నమైనదని భావించగానే నాన్కింగ్ వదలి వెళ్ళడానికి తీర్మానించినట్లు తెలుస్తున్నది. ఈ నిర్ణయం చేయడానికి పూర్వం చైనా ప్రధాని హోయింగ్ చిన్ కమ్యూనిస్టుల శాంతిప్రతిపాదనలగురించి సభ్యులకు నివేదిక సమర్పించారు. కమ్యూనిస్టుల షరతులను అంగీకరించడమంటే పూర్తిగా దాసోహ మనడమేనని ప్రధాని తెలిపినట్లు తెలియుచున్నది.

కమ్యూనిస్టులు టుచియో, చియాంగ్ చో, యూచిలోవుల పై ఫిరంగి కాల్పులుసాగించినారని గత రాత్రి నాన్కింగ్ ప్రభుత్వ అధికారి ఒకడు వెల్లడించెను. నదిని ఎట్టి ప్రతిఘటనాలేక దాటడానికి అంగీకరించాలని కమ్యూనిస్టులు అడిగిన దాన్ని ప్రభుత్వం తిరస్కరించడం వల్ల కమ్యూనిస్టులు ఉత్తరతీరంపై విజృంభించినారు. నిన్న బ్రిటిష్ నౌక కమ్యూనిస్టుల ఫిరంగి కాల్పుల కాహుతి యైన చిన్కియాంగ్ ప్రాంతంనుండి ప్రజలు అసంఖ్యాకంగా వెళ్ళిపోతూ ఉన్నట్లు వార్తలు వస్తున్నవి.

## సరిహద్దుఆఫ్ఘనులస్వాతంత్ర్యాన్ని గుర్తించకపోతే యుద్ధం తప్పదు

### పాకిస్తాన్‌కుకాబూల్‌పత్రిక 'అనిస్' తీవ్రహెచ్చరిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: ఆఫ్ఘనిస్తాన్‌లో పాకిస్తాన్ ప్రతికూల ప్రదర్శనల గురించిన వార్తలు అనునిత్యం 'భారాశాహి'గా వస్తూనేఉన్నవి. గత సంక్రవారం సల్తనస్తానసీదులో ఉపన్యసించుచూ మహమ్మద్ సర్ సాహెబ్ ఇలా పాకిస్తానును హెచ్చరించినట్లు తెలుస్తున్నది. "మన సహోదరుల రక్షణకు వాళ్ళ హక్కులను కాపాడవలెనని మన మతం మనల నాదేశించుచూ ఉన్నది.

పాలస్తీనాలో ముస్లింలపై జరిగిన అత్యాచారములను ఆఫ్ఘనిస్తాన్ సహించలేదు. అలాగే మనపొరుగున సరిహద్దు ప్రాంతాల్లోని గిరిజనులవారిపై ఇతరులు అన్యాయపు పనులు చేస్తూఉంటే మనం కళ్లు అప్పగించి చూడరాదు."

పాకిస్తాన్‌కూ ఆఫ్ఘనిస్తానుకూ యుద్ధం రాదని ఇటీవల పాకిస్తాన్ రేడియో చేసిన ప్రకటనను పరిహసిస్తూ 'అనిస్' అనే

(2-వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ దశమి
1949 సం॥ ఏప్రిల్ 22 శుక్రవారం
ప॥ దశమి రా 1-22 శ్రవ రా 8.15 వర్జ్యం తె 4-20 కు.
బ॥ ఏకాదశి ఏప్రిల్ 23 శనివారం
శ॥ ఏకాదశి రా 3.50 శత రా 11-11 వర్జ్యం ఉ 6-7 కు.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ చైత్ర బ॥ దశమి
శుక్రవారం

## కాశ్మీర్ కమిషన్ కర్తవ్యం

కాశ్మీరు ప్రజల పాకిస్తాన్ అభిమానము, పక్షపాతము గురించి కరాచీ పాలకులకు ఎన్నడు దృఢమైన నమ్మకము లేదని గత ఆగస్టు 13-వ తేదీని ఉభయ అధినివేశములు అంగీకరించియుండిన యుద్ధ విరమణ ఒడంబడిక షరతులను అమలు జరుపుటలో పాకిస్తాన్ ప్రభుత్వము అనుసరించుచున్న వింతవైఖరి స్పష్టము చేయుచున్నది. న్యాయమైన, శాస్త్రసమ్మతమైన మార్గములద్వారాగాక, కేవలము పాకిస్తాన్‌ను సంపాదించినట్లే జమ్మూ, కాశ్మీరు సంస్థానమును సంపాదింపదలచినట్లు గడచిన పదునెనిమిది మాసములుగ పాకిస్తాన్ ఆప్రాంతమునజరిపిన సైనికచర్యలు వెల్లడి చేసినవి. ఆ ప్రయత్నములు పూర్తిగ విఫలమగుటవలననే సమితి మధ్యవర్తిత్వమునకు పాకిస్తాన్ సమ్మతించినది. సమితి పరిశీలకులు స్వయముగ పరిస్థితుల నన్నింటిని సమగ్రముగ విచారించుటతో పాకిస్తాన్ గుట్టు బయల్పడెను. వ్రతము చెడి ఫలము దక్కనందున, తిరిగి సమితి కమిషన్ కార్యక్రమమునకు విఘాతములను కల్పించుచుండెను. 1948 ఆగస్టు 13-వ తేదీ ఒడంబడికనే ఉల్లంఘించెను. సమస్యను మరింత క్లిష్టమునర్చెను. ఆ కారణముగనే ఈ మాసాంతమునకు భారతదేశము వచ్చి తన విధి నిర్వహణమున కుపక్రమింపదలచిన జనవాక్య నిర్ధారణాధికారి అడ్మిరల్ చెస్టర్ నిమిట్జ్ తన కార్యక్రమమును వాయిదా వేసుకొనవలసివచ్చెను.

పాకిస్తాన్ అధికారుల ప్రస్తుతపు వైఖరిని గమనించిన కాశ్మీరు సమస్య శాంతియుతముగ పరిష్కారము కాగల యవకాశము లేనట్లే కన్పించుచున్నది. ఇటీవల పాకిస్తాన్ విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వము, ప్రభుత్వ సేనలగురించి చేసిన ప్రకటనమును బట్టి పాకిస్తాన్ సమాధానమునకు రావలెనని ఆతురపడుచున్నట్లు తోచుటలేదు. కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లా అనహార ఒడంబడికను ఉభయ అధినివేశములు అంగీకరించినగాని భద్రతాసమండలి తీర్మానము ననుసరించి జనవాక్య నిర్ణయాధికారి నియామకము చేయుటకు వీలులేదని తెలుపుట అన్నివిధముల సమర్థనీయముగనే యున్నది. యుద్ధ విరమణ ఒడంబడికనే పాకిస్తాన్ ఉల్లంఘించియుండ, అనహార ఒడంబడిక ఉభయ అధినివేశములు ఆమోదించకుండ ఉన్నంతవరకు జనవాక్య నిర్ధారణాధికారి వచ్చి చేయగలిగిన దేమియులేదు. కాశ్మీరు కమీషను ముందుగ పాకిస్తాన్ యుద్ధ విరమణ ఒడంబడికను పూర్తిగ అంగీకరించి అమలు జరుపునట్లు చేయవలసియున్నది. కమీషన్ పని చేయగలదను విశ్వాసము కలుగుటకు గత చరిత్ర దోహదము చేయుటలేదు.

ఆగస్టు 13 వ తేదీ ఒడంబడికను పాకిస్తాన్ నిర్నిబంధముగ అంగీకరించియుండలేదు. కమిషను సభ్యులు అన్ని విషయములను ఆ ఒడంబడికయందు స్పష్టముచేసి యుండలేదు. సంస్థానముపై దురాక్రమణ జరిపిన పాకిస్తాన్, ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వ సేనలు కాశ్మీరు నుండి వైదొలగవలెనని, ఆప్రాంతపు పరిపాలన అబ్దుల్లా ప్రభుత్వ పరము కావలెనని భారత ప్రభుత్వము ఆదిలో సూచించియుండెను. కాని కమిషను సభ్యులు రాజీ మార్గముగ పాకిస్తాన్ అధీనమైయున్న ప్రాంతముపై అధికారమును ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వమునకు అప్పగించుట వలననే పరిస్థితు లీవిధముగ విషమించినవి.

కాశ్మీరు కమిషను ఇంతవరకు వ్యవహరించిన పద్ధతులను, విధానమును మార్చుకొని పాకిస్తాన్ ఒడంబడిక షరతులకు కట్టుబడి యుండునట్లు చేయవలసియున్నది. అది జరుగనంతవరకు జనవాక్య నిర్ణయాధికారి భారతదేశము వచ్చి చేయగలిగినది యేమియూ ఉండదు.

## "అయిరోపా రాజ్యసమితి అత్యవసరం"

### విన్‌స్టను చర్చిలు హెచ్చరిక

లండన్, ఏప్రిలు 20: లండనులో సమావేశమైన 21 యూరోపియను రాజ్యాల ఆర్థిక మహాసభయందు మాజీ బ్రిటిష్ ప్రధాని విన్‌స్టను చర్చిలు యుపన్యసించుచూ ఇట్లు చెప్పెను.

యూరోపు ఖండ రాజ్యాలు ఏకము కావలెను. ఎవరి రాజ్యక్షేమమును వారు కోరితే స్వదేశభక్తులగుట యే గాక యూరోపియనుల మనెడి అభిమాన భావముతో యూరోపియను రాజ్యాల సమష్టి శ్రేయముకై కృషి చేయవలెను. మనము బికారులముగాని, బానిసలముగాని కాకూడదు. ఏ దేశమున కా దేశం తన వ్యాపారాభివృద్ధికొరకై ఇతర దేశవస్తువులను బహిష్కరించుటగాని ఆయా దేశవస్తువుల దిగుమతులకు హెచ్చు సుంకముల విధించుటగాని పూర్వకాలపు పాతపద్ధతియై యున్నది. ఇట్టిది పోవలెను. విపరీతమైన స్వదేశాభిమానం తగదు. యూరోపియనురాజ్యాలు ఏకమైనట్లయితే ప్రపంచశాంతికిగల ప్రబలశత్రు సమువాయములను ప్రతిఘటించగలము. ఈ సభను బ్రిటిష్‌మంత్రి అలెగ్జాండరు ఉపక్రమించెను.

## దక్షిణాఫ్రికా ప్రతినిధికి ప్యాస్‌పోర్టు నిరాకరణ

లండన్, ఏప్రిల్ 20: ఐక్యరాజ్య సమితిలో దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెస్ ప్రతినిధి జ్ఞానిసింగ్ నేడు, అమెరికా రాయబార కార్యాలయం వారు తనకు ప్యాస్‌పోర్టు యివ్వ నిరాకరించారని లండనులో ఒక ప్రకటన చేసెను. 'అందుకు వారేమీ కారణం చెప్పలేదు' అని అతను చెప్పెను అమెరికా ప్యాస్‌పోర్టు నిచ్చి, ఇండియాలో సంపాదించుకొన్న ఎం. డి. నాయుడు నా స్థానంలో అక్కడ ఉన్నాడు" అని అతను తెలియజేసెను.

## ఆంధ్ర రాష్ట్ర హిందీ మహాసభలు

ఏలూరు, ఏప్రిల్ 20: ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభలు ఈ నెల 27, 28, 29 తేదీలలో ఇక్కడి హిందూస్తానీ నగరంలో జరుగుతాయి. మహాసభలకు భారత శాసన సభ ఉపాధ్యక్షుడు మాడభూషి అనంతశయనం అయ్యంగారు అధ్యక్షత వహిస్తారు. ఆ రాష్ట్ర విశ్వవిద్యాలయ ప్రారంభోపన్యాసం చేస్తారు.

ఈ సంవత్సరంలో ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకుల 15వ మహాసభ హిందీ ప్రేమి మండలుల 8వ సమావేశము, హిందీ సాహిత్యగోష్ఠి, పండిత సమ్మేళనాలు హిందీనాటక ప్రదర్శనాలు నాటక పోటీలు జరుగుతాయి.

## నెహ్రూ విశ్వాసం

[1 వ పేజీ తరువాయి]

సర్వసేనాధిపతులును లండను నందలి బర్మీస్ రాయబారియు నుండిరి. ఆరు నెలల క్రిందట లండన్ వచ్చినప్పటికంటె యిప్పుడు పండితుడు ఎక్కువ చురుకుగాను ఆరోగ్యముగాను ఉన్నాడని ఆయనను ఆహ్వానించుటకు వచ్చిన మిత్రులు తలచిరి. తన చుట్టు చేరి, ఏమైనా చెప్పవలసినదని తొందరచేసెడు పత్రికా ప్రతినిధులపైపు తిరిగి పండితుడు మందహాసము చేయుచు 'ప్రపంచ పరిస్థితులు అధ్వాన్నముగా నున్నప్పటికి ప్రపంచ వ్యవహారాలన్నియు చక్కబడునని ఆశాపూరితుడనై యున్నాను' అని చెప్పిరి.

కామన్వెల్తుసభ విషయమై వ్యాఖ్యానింప పండితుడు నిరాకరించుచు 'సభ ప్రారంభముకానున్న సమయమున దాని విషయమై ప్రస్తావించుట సమంజసము కాదని మీరు అంగీకరింతురు' అని నుడివిరి. 'గతరాత్రి నేను భారతదేశమునుండి బయలుదేరి యిప్పుడే యిచ్చటికి చేరితిని. నా ప్రయాణము సుఖవంతముగాను శాంతివంతముగాను వుండెను. ఇప్పుడు హఠాత్తుగా పత్రికలవారియొక్కయు, రేడియోలవారియొక్కయు శాంతియుతమగు నిరంకుశత్వమునకు నేను లోనుగావలసియున్నది. నేను చెప్పదగిన విశేషములేమియు లేవు. ఆరు నెలల యనంతరము యిచ్చటికి వచ్చినందుకు నేను చాలా సంతోషించుచున్నాను. రేపు ప్రారంభమై ఒక వారము రోజులు జరుగు సంభాషణలు ఫలప్రదము కాగలవని ఆశించుచున్నాను' అని పండిత నెహ్రూగారు చెప్పిరి.

రేపు ఉదయము పండిత నెహ్రూగారు శ్రీకృష్ణమీనన్‌గారితోను, భారతప్రభుత్వ విదేశాంగశాఖ కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్‌గారితోను సమాలోచనలు జరిపెదరు. విమానములో, అది బొంబాయిలో బయలుదేరి ఇచ్చటికి చేరువరకు పండిత నెహ్రూగారు అతి ఉల్లాసముగా నుండిరి. సర్ గిరిజాశంకర్‌తో ఆయన సరస సల్లాపాలాడుచుండెను. హాస్యోక్తు లాడుచుండెను. మెక్రోలు పొస్టింగానటకు విమానము బాస్రాలో ఆగినప్పుడు అచ్చటి భారతీయులు పండితునకు స్వాగతమొసంగిరి. కెయిరోలో భారత రాయబారియు, రాయబారవర్గమునకు చెందిన యితర అధికారులును వారికి స్వాగతమొసంగిరి. స్విట్జర్లాండునందలి భారతరాయబారి శ్రీధీరూభాయ్ దేశాయ్ గారు జనీవాలో పండితుని కలిసికొనెను. ఇటాలియన్ ఆల్ఫ్సు పర్వతశ్రేణిపై విమానము వెళ్ళుచుండిన సమయమున అచ్చటి ప్రకృతి సౌందర్యము, శోభ పండితుని ముగ్ధునిగా నొనరించెను. ప్రకృతి సౌందర్యమును తనివిదీర గ్రోలి యానందించుటకై ఆయన ఒకవైపునుండి మరియొకవైపునకు వెళ్ళెను.

'మలబారు ప్రిన్సెస్' లో పండితుని ఇంటర్వ్యూ చేయగా తన ప్రయాణం సుఖంగా జరిగెనని ఆయన చెప్పెను. తాను ప్రయాణముచేసిన విమానము లన్నిటిలోను ఎయిర్ ఇండియావారి అంతర్జాతీయ సర్వీస్ విమానము ఉత్తమమైనదిగా నుండెనని, సభ పూర్తియైన తరువాత ఆ విమానములోనే తాను భారతదేశము తిరిగి వెళ్ళునని భారత ప్రధానామాత్యుడు చెప్పెను.

## కమ్యూనిజంతో పోరాడటం లేదు

### కెయిరోలో నెహ్రూ ప్రకటన

కెయిరో, ఏప్రిల్ 20: లండనులోజరుగనున్న కామన్వెల్తు ప్రధానుల సభకుహాజరగుటకు వెళ్లుచున్న భారతప్రధాని పండిట్ నెహ్రూ, ఇక్కడినుండి వెళ్లటానికి ముందు పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ తాను లండన్‌నుంచి తిరిగిరావటంలో టప్పుడు కెయిరోలో దిగుటకు అవకాశం ఉండక పోవచ్చునని చెప్పారు. గత జనవరిలో జరిగిన ఆసియాదేశాల సభను గురించి అడుగగా, అది ఇష్టాగోష్ఠి సమావేశమనీ, అయితే "దానికి ప్రభుత్వ ప్రాతిపదికమీద ఒక స్వరూపం యిచ్చుటకు ఇండియా ప్రయత్నిస్తోంద"నీ చెప్పారు. ఇండియా కమ్యూనిజానికి ఎదురొడ్డి పోరాటం సల్పుటలేదనీ, విధ్వంసక చర్యలలో పాల్గొన్న వ్యక్తులను మాత్రమే నిర్బంధిస్తోందనీ కూడా ఆయన చెప్పారు. యుద్ధమే సంభవించేటట్లయితే ఇండియా వైఖరి ఎట్లుండునో యిప్పుడే చెప్పటం కష్టం. కాని ఎవరికంటే "మేము బలపడుచున్నాము." అని నెహ్రూ చెప్పారు.

## లండనుకు సింహళ ప్రధాని ఆగమనం

లండను ఏప్రిల్ 20: రేపు లండనులో ప్రారంభం కానున్న కామన్వెల్తు ప్రధానుల సమావేశం క్రిందటిసారి జరిగిన దానికంటె ముఖ్యమైనదిగా ఉంటుందని నేటి ఉదయం ఇచ్చటకు వచ్చిన సింహళప్రధాని సేనానాయకె చెప్పెను. ఆయన విమానం కరాచీ, కెయిరోల మధ్య ప్రతికూల

నాయకుల కారణంగా 8 గంటలు పైగా ఆలస్యమైనది.

దీర్ఘకాలం నుండీ స్వాతంత్ర్యము ననుభవించే దేశాల పరుసను అందుకోవలెనని అభిలాష పడుచున్న నూత్న అధినివేశాలు తమ అభివృద్ధికై ప్రపంచ శాంతి అత్యవసరమని భావించుచున్నవనీ, పోరాటంకంటే ఆర్థికాభ్యున్నతియే సింహళమున కిప్పుడవసరమనీ, తను సమావేశం వారం పదిరోజులకంటె ఎక్కువ పట్టదని ఆయన చెప్పెను.

## లియాకతాలీ - మౌంటుబాటెన్ సంభాషణ

గోస్, ఏప్రిల్ 20: లార్డుమౌంటుబాటెన్ నేడు గోస్ విమానాశ్రయంలో పాకిస్తాన్ ప్రధాని లియాకతాలీ ఖాన్‌తో 6 నిమిషాలసేపు సంభాషించెను. మధ్యధరాసముద్రంలో బ్రిటిష్ క్రూయిజర్ ప్రథమ దళాధిపతిగా ఉంటున్న మౌంటుబాటెన్ తనసతీ సమేతంగా లండనుకు వెళ్లుచున్నాడు. లియాకతాలీ కామన్వెల్తు ప్రధానుల సమావేశమునకు వెళ్లుచున్నాడు.

## ఇతర ప్రధానుల ఆగమనం

లండను, ఏప్రిల్ 20. న్యూజిలెండు ప్రధాని పీటర్ (ఫ్రేజర్, ఆస్ట్రే) లియా ప్రధాని జోసెఫ్ చిఫ్లే, పాకిస్తాన్ ప్రధాని లియాకతాలీ ఖాన్ ఆయన సతీ సమేతుడై వచ్చిరి. వారికి బ్రిటిష్ కామన్వెల్తు శాఖామంత్రి ఫిలిప్ నోయెల్ బేకర్ స్వాగత మిచ్చెను.

## నెహ్రూపైనే కామన్వెల్తు ప్రముఖుల దృష్టి

లండన్, ఏప్రిల్ 20: భారతప్రధాని పండిత నెహ్రూ, బ్రిటిష్‌ప్రధాని క్లెమెంట్ అట్లీని రేపు మధ్యాహ్నం వారి నివాస భవనంలో కలుసుకుంటారు. పాకిస్తాన్, ఆస్ట్రేలియా, న్యూజీలండ్‌ల ప్రధానులు నేటిరాత్రో, లేక రేపు ఉదయమో అట్లీతో ముచ్చటిస్తారు. బ్రిటిష్‌ప్రధాని అట్లీ ఈ వేళ వచ్చిన నాయకులలో ప్రసంగిస్తూ, కలుసుకుంటూ, 13 గంటలు గడిపాడు. అధినివేశ ప్రధానుల సమగ్రసమావేశం శుక్రవారం ప్రొద్దున ప్రారంభమవుతుంది.

కిందటిసారి జరిగిన కామన్వెల్తు ప్రధానుల సమావేశపు నిర్ణయాలనూ, తదితర అంశాలనూ గురించి కామన్వెల్తు దేశాల నిర్దిష్టాభిప్రాయాలను తెలుసుకొని వచ్చుటకై బ్రిటన్ ఆయాదేశాలన్నిటికి ప్రత్యేక ప్రతినిధులను పంపి ఉన్నది. ఈ ప్రతినిధుల చర్యలు, వారు తీసుకుని వచ్చిన నివేదికలు, ప్రస్తుత సమావేశానికి అవతారికవలె ఉపయోగపడగలవు. ఈ ప్రతినిధులలో చర్చలు జరిపి ఉన్నందువల్ల కామన్వెల్తు ప్రభుత్వాలు ప్రస్తుత సమావేశంలో చర్చకు రాగల అంశాలను ముందే ఆలోచించుకొనుటకు వీలు కలిగినది.

భూమినాలుగు ప్రక్కలనుండీ విమానాలు కామన్వెల్తు ప్రధానులను ఇక్కడికు తీసుకునిరావటంతో, కామన్వెల్తు జానాభా 50 కోట్లలోనూ అయిందింట మూడు వంతులు నివసిస్తున్న ఇండియా విషయమూ, ఆదేశపు ప్రధాని పండిత నెహ్రూ అందరి దృష్టినీ ముఖ్యంగాఆకర్షిస్తున్నారు. ఇండియా, కామన్వెల్తుల సంబంధాలలో ప్రస్తుత పరిస్థితులనుబట్టి చాలామార్పులు రానున్నవి కనుక కామన్వెల్తు వ్యవస్థలోనే పెద్దమార్పులు తీసుకురావలసి ఉంటుందని భావించబడుచున్నది. అయినప్పటికీ సమావేశంలో పాల్గొంటున్న వారందరూ సమావేశం ప్రయోజనకారి కాగలదనే ఆశతోనే ఉన్నారు.

### ప్రధానుల వైఖరి

న్యూజిలండ్ ప్రధాని దారిలో కలకత్తాలో ఆగినప్పుడు ఇండియా కామన్వెల్తులోనే ఉండవలెనన్న వాంఛను ప్రకటించెను. ఆస్ట్రేలియా కూడా ఇండియా కామన్వెల్తులో ఉండవలెనని కోరుతున్నదని తెలిసిన విషయమే. తనకూ, కామన్వెల్తుకూ ముఖ్య సంబంధం బ్రిటిష్ సింహాసనమేనని ఆస్ట్రేలియా భావిస్తున్నప్పటికీ, ఈచిహ్నం అంటే ఇష్టం లేనిదేశం కామన్వెల్తులో ఉండగోరితే అది పెద్ద ఆటంకంగా ఉండకూడదని ఆస్ట్రేలియా తలుస్తున్నట్లు తెలుస్తున్నది.

దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ మలాన్ తన సంభాషణలలో, రిపబ్లిక్‌గా మారిన దేశాలు కామన్వెల్తులో ఉండటం అసంబద్ధము కాదని సూచించెను. ఈ విషయమై కామన్వెల్తు ప్రధానులనేకులు తమతోపాటు అనేక సూచనలను తీసుకొనివచ్చినట్లు తెలుస్తున్నది. (రాయిటర్)

## రక్షణ - ఆర్థిక సహకారం

లండన్, ఏప్రిల్ 20: కామన్వెల్తు రక్షణాధికార్యులు సమావేశం మొకటి 10 రోజులపాటు ఇక్కడ జరుగుతుంది. కామన్వెల్తు సమావేశంలో పాల్గొంటున్న దేశాలన్నీ ఈ రక్షణ సమావేశానికి తమ ప్రతినిధులను పంపినవి. బ్రిటన్ తరపున ఫీల్డ్ మార్షల్ మాంట్‌గోమరీ, ఎడ్మిరల్ లార్డ్ ఫ్రాంసిస్ మౌంట్ బాటన్ మొదలైన ప్రముఖులు ఈ సమావేశాల్లో పాల్గొంటారు. ఈ సమావేశాల్లో 4 రోజులపాటు నౌకా విన్యాసాలు, 3 రోజులు విమాన దళ విన్యాసాలు, సైనిక విన్యాసాలు ఉండగలవు.

ఈ సమావేశంలో అత్యంత ప్రధానమైన రక్షణ నిర్ణయాలు, పన్నాగాలు నిర్ణయించబడునని తెలుస్తున్నది. ఈ కామన్వెల్తు రక్షణ సమావేశమే కామన్వెల్తు ప్రధానుల సమావేశపు ముఖ్యలక్ష్యమనికూడా తెలుస్తున్నది. ప్రతిప్రధానీ తన ప్రతినిధులతో విడిగా ఈ విషయమై రహస్య సంప్రదింపులు జరిపెదరు.

కామన్వెల్తు దేశాలమధ్య ఆర్థిక సహకారం, పారిశ్రామిక పునర్నిర్మాణం, డాలర్ వ్యాపారంలో సర్దుబాటు మొదలైన అంశాలను కామన్వెల్తు ప్రధానులు చర్చిస్తారు. ఆగ్నేయాసియాలో కమ్యూనిస్టు ప్రమాదం, బర్మా మొదలైన సమస్యలు కూడా ఇందులో చర్చకు రాగలవు.

(యు. ప్రె.)

## బర్మా అంతర్యుద్ధం

[1 వ పేజీ తరువాయి]

ప్రభుత్వంపై తిరుగుబాటు చేస్తూ తెల్ల జెండా కమ్యూనిస్టులతో చేరారు. ఎర్ర జెండా కమ్యూనిస్టులు ట్రాట్‌స్కీ వాదులుగా పరిగణింపబడ్డారు.

థాకిన్‌సూ తూన్, గోషాల్‌లు కిందటి సంవత్సరంనుండీ తప్పించుకొని తిరుగుతూ ప్రభుత్వంపై తిరుగుబాటు నడపడానికి మధ్యబర్మాలో కార్యకేంద్రం ఏర్పరచుకొన్నారట.

ఎర్రజెండా కమ్యూనిస్టుల నాయకుడైన థాకిన్‌సో సంవత్సరంపైగా అందకుండా తప్పించుకొని 1948 మార్చిలో అరెస్టు చేయబడి రంగూనుకు వాయవ్యదిక్కుగా 70 మైళ్లలో ఉన్న తారావది జైలులో నిర్బంధించబడి, గడచిన ఏప్రిలు 8 న ఆ పట్టణం తిరుగుబాటుదార్ల వశం కాగా విముక్తుడైనాడు.

ప్రోములో ఆహారకొరతా, కరవూ తీవ్రంగా ఉన్నవనీ, ఇటీవల అక్కడ అనేక ఇళ్లు పరశురామప్రీతి అయినవనీ అక్కడినుండి వచ్చేవారు చెప్పారు. తెల్ల ముఠావారూ, కమ్యూనిస్టులూ, ప్రభుత్వ సేనలనుండి పరారీ అయినవారూ కలిసి ప్రోములో తిరుగుబాటుదార్ల ప్రభుత్వం సాగించినట్లుకూడా వార్తలు వచ్చినవి.

### 800 కరెనుల దాడి

రంగూనుకు ఉత్తరంగా 90 మైళ్లలో ఉన్న ఒక పట్టణంపై 800 మంది కరెను తిరుగుబాటుదార్లు దాడిచేయగా ప్రభుత్వ సైన్యాలు విమానాల సహాయంతో దాడి భగ్నంచేసినవనీ, నూరు మంది కరెనులు నష్టమైనట్లు తెలుస్తున్నదనీ ప్రభుత్వం ప్రకటించింది.

### తిరుగుబాటుదార్లు కొల్లగొట్టిన మొత్తం

1948 మార్చిలో తిరుగుబాటు ఆరంభమైన నాటినుండీ బర్మాలోని తిరుగుబాటుదార్లు ప్రభుత్వ ఖజానాల నుండి 3 కోట్ల రూపాయలూ, అంతులేని ధాన్యమూ, కలపా మొదలైన ప్రభుత్వ ద్రవ్యాలూ కొల్లగొట్టారని అధికారయుతంగా ప్రకటించబడింది.

## కాబూల్ పత్రిక హెచ్చరిక

1 వ పేజీ తరువాయి

కాబూల్ పత్రిక ఈ క్రిందివిధంగా ఒక సంపాదకీయవ్యాసం వ్రాసింది." తన రాజ్యాన్ని విస్తరింపచేసుకోవాలనే ఆశ ఆఫ్ఘనిస్థాన్‌కు లేదు. సరిహద్దు ఆఫ్ఘనిస్థాను స్వాతంత్ర్య ప్రతిపత్తి ఉండాలని మాత్రం ఆఫ్ఘనిస్తాన్ కోరుతూఉంది. ఈ కోరికను పాకిస్తాన్ మన్నించి నేడే ఆదేశంతో శాంతిమార్గాన సంప్రదింపులు జరపడానికి మేము సిద్ధంగానే ఉన్నాం. లేదా ఆతరువాత జరిగే సంఘటనలకు పాకిస్తానే బాధ్యత వహించవలసి ఉంటుంది."

## మాంసం అమ్ముకొంటున్న కోటీశ్వరులు

బొంబాయి, ఏప్రిల్ 20: దేశవిభజనానంతరం జరిగిన జాతి సంఘర్షణల ఫలితంగా భూరాసింగు అనే కోటీశ్వరుడూ, ఆయన కుమారుడూ ప్రస్తుతం అజ్మీరులో మాంసం విక్రయించుకొంటున్నారు. కొండిసింగు వదలివచ్చిన ఆస్తుల విషయంలో పాకిస్తాను చేస్తున్న తాత్సారమూ, ఈ సమస్యను శీఘ్రంగా పరిష్కరించడంలో ఇండియాప్రభుత్వంవారి అశక్తతా తమకీగతి తెచ్చిపెట్టినవని వారు చెబుతున్నారు. "ధనం పోయినా, మానధనం పోక, యాచించటానికి మనస్కరించక ఈ వృత్తి అవలంబించాము. సింధురాష్ట్రంలో తరతరాలనుండి ప్రఖ్యాతమైన పొలాలుండేవి. భూమిశిస్తుక్రింద ఏటా 3 లక్షలు చెల్లించేవారట.

## "కామన్వెల్తుకు బ్రిటను రాజు ఏకైక చిహ్నం కానవసరంలేదు"

### "మాంచెస్టరు గార్డియన్" పత్రిక సూచన

లండన్, ఏప్రిలు 20: కామన్వెల్తు చిహ్నాలలో బ్రిటనురాజు ఒకచిహ్నంగా మాత్రమే ఉండి, కామన్వెల్తు స్వతంత్ర రాజ్యాల సమాఖ్యగా భావించబడినట్లయితే స్వతంత్ర రిపబ్లికులకు కామన్వెల్తులో స్థానం ఉంటుందనీ, "బ్రిటిషు" అనేపదం విసర్జించవచ్చుననీ సూచించుచూ నేడు "మాంచెస్టరు గార్డియను" లిబరలు పత్రిక ఈ విధంగా సంపాదకీయం వ్రాసింది:

"సర్ ఇవాన్ జెన్నింగ్స్ చెప్పినట్లు ఇండియాను కామన్వెల్తులో ఉండాలనే అభిలాషా, కామన్వెల్తు రాజ్యాలను ఇండియాను ఉంచుకోవాలనే అభిలాషా ఉన్న పక్షమున, క్రమమైన భాషలో నిర్వచనం తయారు చేయడం కన్న పెద్ద సమస్య ఏమీలేదు. ఈ సమస్యను పరిష్కరించాలంటే కామన్వెల్తు ప్రభుత్వాలన్నీ తాము కామన్వెల్తులో చేరి ఉన్నట్లు తీర్మానించి ప్రకటన చేయవచ్చును. ఆ తీర్మానంలో ఈ ప్రభుత్వాలవారు తమకుగల పారస్పర్యం కేవల మైత్రిని మించిందని ప్రకటించవచ్చును. కామన్వెల్తు పౌరసత్వం గురించి ప్రతి అధినివేశము చట్టం అమలుచేస్తూ, కామన్వెల్తు ఒక విపుల రాజ్యం కాక స్వతంత్రరాజ్యాల సమాఖ్య అనీ, కామన్వెల్తు పౌరసత్వం అంటే ప్రతి అధినివేశమూ ఇతర అధినివేశాలకు ఇచ్చే హక్కు అనీ వివరించవచ్చును. బ్రిటిషు కామన్వెల్తు అనేమాటకు బదులు కామన్వెల్తు అనేమాట వుంచవచ్చును.

"ఇటువంటికూటమి ఎంతఅపూర్వమైనదైనప్పటికీ దీనిని ఇతరప్రపంచం గుర్తించ దానికభయం ఉండదు. ఇటువంటి కామన్వెల్తుకు రాజు ప్రధానచిహ్నంగా ఉండడానికిబదులు అనేకచిహ్నాలలో ఒకటిగా ఉండవచ్చు. ఈ కామన్వెల్తులో స్వతంత్ర రిపబ్లికులకు స్థానముంటుంది. రాజరికం ఒప్పుకొనే అధినివేశాల ప్రతిపత్తికి నష్టమేమీ ఉండదు. ఆంగ్ల జాతుల వారికి రాజచిహ్నం ప్రధానసూత్రంగా ఉండి, ఇతరజాతులకు ఇతరచిహ్నాలుండవచ్చును. అందరూ రాజచిహ్నాన్నే కామన్వెల్తు ఏకైకచిహ్నంగా ఆమోదించాలని పట్టుబట్టి, ఇతరసూత్రాలను ముఖ్యమైనవాటిని తోసిపుచ్చి కామన్వెల్తును పతనంకానివ్వడం అవివేకం." రష్యానుచూపి ఇండియాను భయపెట్టుతూ కన్సర్వేటివు పత్రిక "డెయిలీగ్రాఫ్" ఇలావ్రాసింది.

"కామన్వెల్తులో ఉండదలిస్తే సాంతం ఉండిపోవాలి, లేదా మానాలి అనే పట్టుదల ఇతర అధినివేశాలదిగాని బ్రిటనుది కాదని ఇండియాప్రధాని జవహర్లాలు నెహ్రూ కామన్వెల్తు చర్చలలో తెలిసికొన గలుగుతాడు. ఇండియా విశేకసంతంగాసమగ్రసభ్యత్వానికి అంగీకరించుతుందని ఆశిస్తున్నాము. నెహ్రూ ఇందుకంగీకరించనిచో ఇండియాసామ్రాజ్యాన్ని వదలిపోతుంది. ఇందువల్ల సామ్రాజ్యానికి నష్టం కనుక ఇది శోచనీయమే. కాని ఇందువల్ల ఇండియాకు మరింతనష్టం. రష్యా ఆక్రమణ ప్రమాదం ఎదుర్కొనడానికి ఇండియా ఒంటరిదై పోతుంది."

### ఉద్యోగ వార్తలు

ఉదకమండలం డిప్యూటీ కో ఆపరేటివ్ రిజిస్ట్రారు శ్రీ ఎ. సంకటేశన్ ఏప్రిల్ 2 నుండి 30 రోజులు శలవొసగబడిరి.

డిప్యూటీ కలెక్టరు శ్రీ వి. సదానందం పై నెలరోజులు శలవొసగబడిరి.

## ఇటలీ వలసలకు స్వాతంత్ర్యమివ్వాలి

### సమితి ఉపసంఘంలో బర్మా ప్రతినిధి సూచన

లేక్ సక్సెస్, ఏప్రిల్ 20: ఇదివరలో ఇటలీ వలసదేశముగానున్న లిబియాకు స్వాతంత్ర్యమొసంగవలెనని, వెంటనే స్వాతంత్ర్యమొసగ వీలులేనియెడల ఐక్యరాజ్యసమితివారు లిబియాను ఏకఖండముగా తమ ధర్మకర్తృత్వము క్రిందికి తీసికొనవలెనని నేడు బర్మాప్రతినిధి ఐక్యరాజ్యసమితి రాజకీయ కమిటీలో ప్రతిపాదించెను. వెంటనే లిబియాకు స్వాతంత్ర్యమొసంగ వీలులేనియెడల దానిని ఐక్యరాజ్యసమితి పాలించవలెనని భారతదేశ ప్రతినిధి వెలిబుచ్చిన అభిప్రాయముతో తాను ఏకీభవించుచుండెనని ఆయన చెప్పెను. భూభాగములను ఏకము చేయుటకు బదులు విభజించు ఐక్యరాజ్యసమితి ధోరణి బర్మాకు ఆందోళన కలిగించుచుండెనని, ఏదో ఒక దేశమునకు ధర్మకర్తృత్వాధికారమిచ్చుట కాలనీల నేర్పరుచుట వంటిదేనని, సత్వర స్వాతంత్ర్య ప్రదానమున కది అడ్డుతగులునని ఆయన చెప్పెను. పూర్వము ఇటలీక్రింద నుండిన దేశమును తిరిగి యిటలీకి యిచ్చుటకు ఆయన ప్రాతికూల్యము వెల్లడించెను. ఫెజ్జాన్‌పై ఫ్రాన్సు ధర్మకర్తృత్వము యథాప్రకారముగా సాగవలెనను సూచననుగూడ ఆయన ప్రతిఘటించెను.

లిబియా విషయమై సమగ్రవిచారణ చేయుటకు ఒక ప్రత్యేక కమిషనును యేర్పరుపవలెనని ఆస్ట్రేలియా ప్రతినిధి చెప్పెను:—

లిబియాను, ఎరిత్రియా, సోమాలిలాండ్లలో కొంతభాగమును ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వము క్రిందికి తీసికొనిరావలెనను సూచనను చైనా ప్రతినిధి సమర్థించెను. లిబియా, ఎరిత్రియాలు 5 సంవత్సరములు ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వము క్రింద నుండవలెనని ఆయన చెప్పెను.

## ఆహారమంత్రుల సమావేశం

న్యూఢిల్లీ ఏప్రిల్ 20: 1951 సం॥ కల్లా భారతదేశం ఆహార విషయమై స్వయం పోషకము కావలెనని ప్రభుత్వం ప్రకటించిన పథకము నమలుచేయు పద్ధతుల నాలోచించుటకై రాష్ట్ర ఆహారమంత్రులు కేంద్ర ఆహార మంత్రి జైరాందాస్ దౌలత్రాం అధ్యక్షత క్రింద డిల్లీలో ఏప్రిల్ 30 వ తేదీన సమావేశమగుచున్నారు.

## రాష్ట్రపతితో నాడార్ ప్రభృతుల చర్చలు

చెన్నపట్నం, ఏప్రిల్ 20: రాష్ట్రపతి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని నేడు శ్రీయుతులు కామరాజ నాడార్ మంత్రులు భక్తవత్సలం, చంద్రమౌళి, సంజీవరెడ్డిగారలు దర్శించి సంప్రదింపులు జరిపిరి.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు డాక్టరుగారిని దర్శించిరి.

## అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాలకు సైనిక సహాయపు బిల్లు

### సెనేట్ విదేశాంగ వ్యవహారకమిటీలో ప్రతిపాదన

వాషింగ్టను, ఏప్రిల్ 20: కొన్ని దేశాలకు మిలిటరీ సహాయము చేయుటకు అమెరికన్ ప్రభుత్వమునకు అధికారము నిచ్చు, సెనేట్ విదేశాంగ వ్యవహారముల కమిటీకి రేపు ఒక బిల్లును ప్రతిపాదించెదనని విదేశాంగమంత్రి డీన్ అచిసన్ నేడు ప్రకటించెను. ఈ బిల్లును అమలుచేయుటకు ఎంత మొత్తం కావలసివచ్చునో కమిటీకి వివరించెదనని కూడా అతను చెప్పెను.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికపై సంతకములు పెట్టిన అన్ని దేశాలకు కాక కొన్నిటికి మాత్రమే ఈ సహాయం ఇవ్వబడునని, అమెరికా ప్రత్యేక ఒప్పందాలు చేసుకున్న టర్కీ, గ్రీసు, ఇరానా మున్నగు కొన్ని దేశాలకు కూడ ఈ సహాయం వర్తించునని భావింప బడుచున్నది.

## దక్షిణ ఆఫ్రికాపై ఇండియా ఫిర్యాదు

లేక్ సక్సెస్, ఏప్రిల్ 19: దక్షిణాఫ్రికా ప్రభుత్వము భారతీయులపట్ల అనుసరించుచున్న విధానంపై ఇండియా ప్రభుత్వం చేసిన ఫిర్యాదు యీ సెషన్‌లో ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘం ఎదుట చర్చకు వచ్చునని ఐక్యరాజ్యసమితి దక్షిణాఫ్రికా ప్రతినిధివర్గ నాయకుడు ఎరిక్ లోకు తెలియజేయబడింది. రాజకీయ సంఘం ఏటుబ తాను చేయవలసిన ఉపన్యాసంయొక్క ముసాయిదాను తయారు చేయుటకు ఎరిక్ లో ప్రారంభించెను. ఇందులో ఆయన, దక్షిణాఫ్రికా భారతీయులపట్ల ప్రభుత్వం అనుసరించు విధానంపై జోక్యం చేసుకొనుటకు సమితికి హక్కులేదని వాదింపనుండెను.

# చెన్నపట్నంపై హక్కులను శాశ్వతంగా వదులుకుంటేనే



ఈ నెల 20 వ తేదీన నిజాం మిలిటరీ గవర్నరు, తదితర అధికారులు రాష్ట్రప్రధాని శ్రీ కుమారస్వామి రాజా, ఇతర అధికారులను కలుసుకొని, ఉభయప్రభుత్వాలకూ సంబంధించిన సమస్యలను చర్చించిరి.

## త్వరగా యుద్ధవిరమణకు సమ్మతింపమని కమ్యూనిస్టులకు విజ్ఞప్తి

### చైనా అధ్యక్ష, ప్రధానుల సంయుక్త ప్రకటన

నాన్కింగ్, ఏప్రిల్ 21: "మీరు ప్రతిపాదించిన సంధిషరతులను న్యాయదృష్ట్యా పునఃపరిశీలించి త్వరగా యుద్ధవిరమణకు సమ్మతించండి" అని చైనా తాత్కాలిక అధ్యక్షుడు లీ సుంగ్ జెన్, ప్రధానమంత్రి హోయింగ్ చిన్ గారలు సంయుక్తముగా ఒక విజ్ఞాపన పంపినట్లు చైనా ప్రభుత్వోద్యోగియొకరు గతరాత్రి వెల్లడించారు. ఈ విజ్ఞాపన 2 వేల పదజాలంతో కూడి ఉందని, కమ్యూనిస్టుల సమాధానం వచ్చేవరకూ ఈ విజ్ఞాపన ప్రచురింపబడ దనికూడా అతడన్నాడు.

### చైనాప్రభుత్వాన్ని కాంటన్‌కు మార్చేయత్నం

నాన్కింగ్, ఏప్రిల్ 20: ఇదివరలో చైనా విదేశాంగ మంత్రిగా పనిచేసిన వాంగ్ షిహ్ చెన్ నేడు విమానంలో కాంటన్‌కు వెళ్లెను. చైనా ప్రభుత్వాన్ని నాన్కింగ్ నుండి కాంటన్‌కు ఖాళీ చేయించే ప్రయత్నం మీద నని ఇక్కడ భావించ పడుతున్నది.

నేటి రాత్రి ప్రధాని హోయింగ్ చిన్ అధ్యక్షతన ఒక సమావేశం జరిపిన తరువాత ప్రభుత్వం కాంటన్‌కు బయలుదేరుతుందని ఇక్కడ అనుకుంటున్నారు. ప్రభుత్వాన్ని తరలించుకుని వెళ్లటానికై నాన్కింగ్ విమానాశ్రయంలో రవాణా విమానాలు సిద్ధంగా ఉన్నవి. నేటిరాత్రి సమావేశంలో నాన్కింగ్ ప్రభుత్వం నిలిచిపోరాదటమో, లేక పారిపోవటమో నిర్ణయించుకుంటుంది.

నేటిరాత్రి నాన్కింగ్‌లో కమ్యూనిస్టు ఫిరంగులమ్రోతలు వినపడుతున్నవి. ఏ క్షణానైనా కమ్యూనిస్టులు నగరంమీదికి పడవచ్చునని భావించపడుతున్నది. 25 వ తేదీకల్లా నాన్కింగును ఆక్రమిస్తామని కమ్యూనిస్టులు ప్రకటించినట్లు ధృవపడనివార్తలు చెప్పుతున్నవి.

నాన్కింగుకు 60 మైళ్లు దిగువగా ఉన్న చింకియాంగ్ వద్ద యాంగ్ సీనదిని దాటటానికి కమ్యూనిస్టులు ప్రయత్నించ వచ్చునన్న ఆ ప్రక్కనుంచి ప్రజలంతా ఖాళీ చేసి వస్తున్నారు. చెంకియాంగ్ వద్దనే నిన్న రాత్రి కమ్యూనిస్టు ఫిరంగులు బ్రిటిష్ నౌక, 'ఏమెథిస్ట్'ను ఢీకొని వేసినవి. ఇక్కడినది మధ్యలో ఉన్న ముఖ్యమైన 2 లంకలను కూడా కమ్యూనిస్టులు వశపరచుకున్నారు. నిన్నరాత్రి నాన్కింగ్‌కు పడమరగా పాంసాన్ చెన్ అనే చోటనదిని దాటటానికి కమ్యూనిస్టులు ప్రయత్నించారని తెలుస్తున్నది.

### తపాలా రేట్లు

ప్రస్తుతం అమలులో ఉన్న తపాలా రేట్లను, టెలిఫోను రేట్లపై ఆధారపడి ఉన్న ఒడంబడికలను 1950 మార్చి 31 వరకూ మార్చకుండుటకు ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వములు నిశ్చయించినట్లు తంతి, తపాలాశాఖ డైరెక్టరు—జనరలు నేడొక ప్రకటన చేసెను.

### బ్రిటిష్ నౌకపై కాల్పులు

1 వ పేజీ తరువాయి

ప్రయాణం చేయసాగినవని తెలియ వచ్చినది.

కాన్సార్ట్ డిస్ట్రాయర్‌పై కాల్పుల వల్ల 9 మంది మరణించినట్లు ముగ్గురు తీవ్రంగా గాయపడ్డట్లు యీ అధికారులు ప్రకటించారు.

అమెథిస్ట్‌లో గాయపడినవారు చింకియాంగ్ హాస్పిటల్ చేర్చబడినారు. హాంకాంగ్ నుంచి సండర్‌లాండ్ విమానం ద్వారా మందులను సరఫరాచేయుటకు యేర్పాట్లు జరుగుచున్నవి.

#### బ్రిటిష్ అధిక్షేపణ

యాంగ్సీనదిలో బ్రిటిష్ యుద్ధనౌకలపై నిన్న కమ్యూనిస్టు సేనలు కాల్పులు జరిపినందుకు, పీపింగ్‌లోని కమ్యూనిస్టు అధికారులకు అధిక్షేపణ తెలుపవలసినదిగా, టీన్ట్సిన్‌లోని బ్రిటిష్ కాన్సలుకు, చైనాలోని బ్రిటిష్ రాయబారి రాల్ఫ్ స్టీవెన్సన్ వర్తమానం పంపినట్లు తెలుస్తున్నది.

#### చైనాకింత వరకూ అమెరికా చేసిన సహాయం

వాషింగ్టన్ ఏప్రిల్ 20: మిలిటరీ సామగ్రిగానేమి, ఆర్థిక సహాయంగానైతేనేమి, అమెరికా చైనాకింత వరకూ 250 కోట్ల డాలర్లను సహాయం చేసినదని, ఇందులో సగం దాకా మిలిటరీ ఖర్చులే ఉన్నవనీ అమెరికన్ విదేశాంగ మంత్రి డీన్ అచిసన్ నేడు వారం వారం పత్రికా గోష్టిలో తెలిపెను. కమ్యూనిస్టులు చైనానంతనూ ఆక్రమిస్తే వారి ప్రభుత్వమును అమెరికా పరిగణించునా అన్న ప్రశ్నకతడు సమాధాన మివ్వలేదు. అంతర్యుద్ధం తిరిగి ప్రారంభమైనదన్న సంగతిని కూడా అతడు ధ్రువపరుపలేదు.

### నిమిట్జ్ ప్రయాణం వాయిదాకారణం

1 వ పేజీ తరువాయి

మింప వలెనని కోరుచు అందుకు అనుసరించ వలసిన షరతులను సూచించుచు పాకిస్తాను ప్రభుత్వమునకును ఇండియా ప్రభుత్వమునకును కాగితమును ఏప్రిల్ 15 తేదీని అందజేసియుండెను. ఈ కాగితమునకు పాకిస్తాను ప్రభుత్వం తన సమాధానమును తయారుచేసి నేడు కాశ్మీరు కమిటీకి అందజేసెను.

పాకిస్తాను వ్రాసిపంపిన సమాధానములో ఏమని వివరించెనో తెలియుటలేదు. కాశ్మీరుకమిటీ తాలూకు 13-8-48 తేదీగల తీర్మానమును, 5-1-49 తేదీ గల తీర్మానమును ఇండియా ప్రభుత్వమున్ను పాకిస్తాను గవర్నమెంటున్ను ఆమోదించెను.

### గవర్నర్‌తో భార్గవా చర్చ

సిమ్లా, ఏప్రిల్ 20: తూర్పుపంజాబు మాజీప్రధానిగోపీచంద్ భార్గవాగారు నేడు రాష్ట్ర గవర్నర్ చందూలాల్ త్రివేదీగారితో సంప్రతించారు.

## హైదరాబాద్‌లో కమ్యూనిస్టు ఉపద్రవం

### నిరోధానికి ఉభయ ప్రభుత్వాల సమిష్టచర్య

చెన్నపట్నం ఏప్రిల్, 21 హైదరాబాదు, మదరాసు ప్రభుత్వాల అధికారుల సంప్రదింపుల ఫలితంగా సరిహద్దు జిల్లాలలో ఒక పోలీసుఇన్స్పెక్టర్ జనరల్‌ను నియమించి, కమ్యూనిస్టు దుండగులు అక్కడినుంచీ ఇక్కడికీ ఇక్కడినుంచీ అక్కడికీ పారిపోయి, దాక్కొనుటకు వీలు లేకుండా అణచివేయుటకు నిర్ణయించిరనియు, ఈ ఏకీకృత అధికార నిర్వహణవల్ల కమ్యూనిస్టు ఉపద్రవము తగ్గగలదని తలచుచున్నారనియు తెలియుచున్నది.

## రాష్ట్రపతితో మద్రాసు ప్రధాని చర్చలు

చెన్నపట్నం ఏప్రిల్ 21: రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారిని మద్రాసు ప్రధాని పూసపాటి కుమారస్వామి రాజాగారిని దర్శించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము, మంత్రివర్గ నిర్మాణము సందర్భమున రాష్ట్రపతితో సంప్రదించి సలహాను స్వీకరించిరని తెలియుచున్నది.

నాడారుగారు నిన్న రాష్ట్రపతితో ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు తమిళులు సుముఖత్వమును వెల్లడించినటుల చెన్నపట్నంపై హక్కులు వదులుకొన్న చాలునని తెలిపినటుల తెలియుచున్నది.

## క్షయవల్ల మనదేశంలో నిమిషమునకు ఒక్కని బలి

### రోగమును నిర్మూలించవలెనని శ్రీమతి అమృతకౌరు ఉద్బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: క్షయవ్యాధి భారతదేశములో నిమిషమునకొక్కని బలిగొనుచున్నదను విషయమును తలపోయునప్పుడు మహాభీతి కలుగుచున్నది. 'ఈ వ్యాధికి విచక్షణలేదు. దీనికి బలియగువారు కొలామంది దేశమునకు మూలకందముగా నుండదగిన యువకులే' అని ఆరోగ్యశాఖమంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌరు భారత క్షయ నివారణ సంఘ ఏకాదశ వార్షికసభలో అధ్యక్షోపన్యాస మొసంగుచు చెప్పిరి.

ఈ రోగము భయంకరముగా వ్యాపించుచున్నదని, దానిని నిర్మూలము చేయవలెనని ఆమె ఉద్బోధించెను. రోగము వచ్చినతరువాత చికిత్సచేయుటకంటె రోగమును నివారించుట ఉత్తమమని ఆమె చెప్పుచు ఈ రోగమును నిర్మూలించుటలో జయము గాంచవలసినయెడల ప్రజల ఆర్థిక పరిస్థితిని బాగుపరుపవలెననుటయు, వారికి పుష్టికరమైన ఆహారము, విశ్రాంతి మంచి యిండ్లు లభించునట్లు చూడవలెననుట నిస్సంశయమనిరి. ప్రజ జీవితప్రమాణములను హెచ్చింపవలెననిరి. జనసమ్మర్దము హెచ్చుచుండుటవల్లను, ఆసుపత్రులు తక్కువగా నుండుటవల్లను ఒకరినుండి ఒకరికి ఈ వ్యాధి వ్యాపించకుండా చేయుట దుర్ఘటమనిరి. ఈదేశమునందలి క్షయనివారణసంఘములు బలీయములనని, ఈ వ్యాధిని నిర్మూలించుటలో యితరులకు వెనకబడవని మంత్రిణి ఆశించెను.

## ఆంధ్రులకు రాష్ట్రం

### కాంగ్రెస్ అధ్యక్షుడు డా. పట్టాభిగారి ప్రకటన

### ఒక్క ఒరిస్సా సరిహద్దు విషయమై కొంతకాలం తరువాత పునరాలోచన

చెన్నపట్నం, ఏప్రిల్ 21: రాష్ట్రపతి డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు భాషారాష్ట్రాలపై అగ్రనాయకత్రయి నివేదికను గురించి పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రశ్నలకు సమాధానమిస్తూ ఆంధ్రులు ప్రస్తుతానికే గాదు శాశ్వతంగానే చెన్నపట్నంపై హక్కులు వదులుకుంటేగాని ప్రత్యేకరాష్ట్రం ఏర్పడదన్నారు. అలా వదులుకోకపోతే రాష్ట్రం ఎప్పుడు రాగలదో కూడా చెప్పడం సాధ్యంకాదన్నారు. బళ్లారిప్రాంతం విషయం కేల్కారు తీర్పు అమలులో ఉంటుందనీ, ఒరిస్సా సరిహద్దును మాత్రం కొన్నాళ్లయిన తరువాత తిరిగి విచారింపవచ్చుననీ అన్నారు.

డాక్టరుగారు విలేఖరుల ప్రశ్నలన్నిటికి సావధానంగా దాదాపు గంటసేపు సమాధానాలు ఇచ్చారు. రాష్ట్రనిర్మాణం విషయమై ఇకముందు జరుగవలసిన పనిని వివరించారు.

ప్ర:-ఆంధ్రరాష్ట్రము సంగతిఏమి?

స:-ఆంధ్రులు చెన్నపట్నం వదులుకుంటే వెంటనే ఆంధ్రరాష్ట్రం వస్తుంది, లేకపోతే ఎప్పటికి వస్తుందో చెప్పలేము. "చెన్నపట్నంపై సర్వహక్కులూ వదులుకోవాలి" అని స్పష్టంగా నాయకత్రయ నివేదిక చెబుతున్నది. నేనూ నాయకత్రయంలో ఒకణ్ణి గనుక జడ్జిస్థితిలో ఉన్నాను. గనక, ఆంధ్రుల హక్కులను గూర్చి ఆంధ్రనాయకులు చెబుతారు. న్యాయవర్గంలోకి వెళ్లినందున కార్యవర్గం వ్యవహారం నేను చెయ్యడం మంచిది కాదు. నివేదికప్రకారం ఆంధ్రులకు రాష్ట్రం ఇపుడు కావాలంటే చెన్నపట్నం వదులుకోవలసిందే లేకపోతే, ఎపుడు రాష్ట్రం వస్తుందో చెప్పలేము. చెన్నపట్నంమీద హక్కు వదులుకోవడం అంటే ప్రస్తుతానికే కాదు. ఎల్లకాలముకూడా.

ప్ర:- కొన్నాళ్ళుపోయాక మళ్ళీ దీని సంగతి ఆలోచించవచ్చునని మీరు బొంబాయిలో చెప్పినారు గదా?

స:- ఆ సంగతి నా దృష్టికి తేబడింది. పునర్విమర్శ చేయవచ్చునని కొన్ని సరిహద్దులు చెప్పాను. ఆ వార్తలో మద్రాసునుగూడా చేర్చారు. కేల్కార్ పరిష్కారం ప్రకారం బళ్ళారిలో మూడు తాలూకాలు ఆంధ్రులక్రింద ఉన్నవి. కర్నాటకులతో ఈ విషయమై జేరానికి దిగదలచుకోలేదు. బళ్ళారినగరం ఆనాడే కర్నాటకులకు యివ్వబడింది. ఇక ఒరిస్సా సరిహద్దు ఒక్కటిమాత్రమే కొంతకాలం తర్వాత పునర్విమర్శ చెయ్యడానికి వీలు ఉన్నది. 11 జిల్లాలు స్పష్టంగా తివాచీ పరచినట్లు ఉన్నవి. బళ్ళారి జిల్లా పరిపాలన సందర్భంలో ఏమి చెయ్యదలచుకున్నారో ప్రభుత్వానికి సంబంధించిన సంగతి. అయితే రాయదుర్గం, అల్లూరు, ఆదోని తాలూకాలు వెంటనే ఆంధ్రరాష్ట్రంలో చేరుతాయి. కర్నాటక రాష్ట్రం నిర్మాణమయ్యేదాకా మిగతా తాలూకాలు ఆంధ్రరాష్ట్రంలోనే ఉంటాయిఅని అంటే ఆక్షేపణలేదు. బళ్లారి విషయమై తర్వాత ఏమైనా చెయ్యదలచుకుంటే పరస్పర సమ్మతి ప్రకారంగాని వేరువిధంగా కాదు.

#### ఎవరు పూనుకోవాలి?

ప్ర: ఆంధ్రరాష్ట్రం తక్షణమే రావాలంటే ఎవరు పూనుకోవాలి.

స:-నాయకత్రయనివేదికను వర్కింగు కమిటీవారు ఆమోదించి భారతప్రభుత్వానికి, రాజ్యాంగ పరిషత్సభ్యులకూ చర్య తీసుకోవలసిందిగా పంపించారు. అల్లా అని చెప్పి భారతప్రభుత్వము వాకొక్కరే ఇందుకు పూనుకోవాలని ఎక్కడాలేదు. వారు చర్యతీసుకుంటారు. మద్రాసు శాసనసభల కాంగ్రెస్ పక్షంవారుగూడా పూనుకొని పదవులకై ఒకతీర్మానాన్ని చెయ్యవలసి ఉంటుంది. "1935 భారత ప్రభుత్వ సవరణచట్టాన్ననుసరించి 290 సెక్షనుప్రకారం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి తపచర్య తీసుకోవలసిందిగా చెన్నరాష్ట్ర ప్రధానిని కోరుచున్నారు. చిత్తూరు, నెల్లూరు, గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి (మూడు తాలూకాలు) రెవెన్యూ జిల్లాలతో ఆంధ్రరాష్ట్రమును ఏర్పరచవలెను. శాసనసభవారా తీర్మానము నామోదించిన తర్వాత మదరాసు మంత్రివర్గంవారు దాని నామోదించి దానిపై 290 సెక్షను క్రింద ఆంధ్రరాష్ట్రము నిర్మించవలసినదిగ గవర్నరు జనరల్‌ను కోరుచూ కేంద్ర ప్రభుత్వమునకు వ్రాయవలసి ఉండును. అప్పుడు భారతయూనియన్లో గల వివిధ రాష్ట్రములజాబితాలో 'ఆంధ్ర'ను గూడా రాజ్యాంగ పరిషత్సభ్యులు చేర్చవలెను.

ప్రశ్న:- ఒక్క కాంగ్రెసు పక్షము వారామోదిస్తే చాలుతుందా? శాసనసభ అనుమతి మరీ అవసరం.

స:- పాతచట్టంప్రకారమైతే ఆతతంగమంతా ఉన్నది. కొత్తచట్టంప్రకారం విభజింపబడే రాష్ట్రప్రభుత్వ అభిప్రాయాన్ని తెలుసుకోవాలి. అనిఉన్నదిగాని శాసనసభ అని లేదు. ఎందుకు ఇంత తొందరపడుతున్నామంటే వచ్చే ఆగస్టు 15 వ తేదీనాటికి నూత్నరాజ్యాంగం అమలులోనికి రానున్నది. ద్రవిడప్రాణాయమంతా లేకుండా శీఘ్రంగా వ్యవహారం నడపుదుందామని ఆంధ్రులు తొందరపడుతున్నారు.

ప్ర:- రాజధానిసంగతి ఏమి?

స:- గవర్నరు జనరల్ ఉత్తర్వులో రాజధానిప్రసక్తికూడా ఉండును. 290 వ సెక్షను 'డెంవ' సబ్ సెక్షను గవర్నరు జనరల్ గారు యుక్తము, అవసరము అని తలచిన నిబంధనలు ఈక్రింది విషయములలో చేయవచ్చునని తెలుపుచున్నది.

డొమినియన్ శాసనసభలో ప్రాతినిధ్యము మార్చుటకు, సరిహద్దుల మార్చుటకు, కొత్త శాసనసభ ఏర్పరచుటకు, లావాదేవీల పరిష్కరించుటకు రాజధానీనగరమును నిర్ణయించుటకు ప్రాతిపదిక కార్యక్రమమును నిర్వహించుటకు కొన్ని నిబంధనలు తెలుపును. ఆంధ్రశాసనసభలో 250 సభ్యులు ఉండవలెనని ప్రస్తుతానికి ఇప్పుడున్న శాసనసభ్యులతోను శాసనసభ, ఇప్పుడున్న మంత్రులతో ప్రభుత్వము ఏర్పడవలెనని తెలుపవచ్చును. చెన్నపట్నం మరో రాజధానీనగర నిర్ణయంవరకు ఉమ్మడిరాజధానిగా ఉండవచ్చునని నిర్ణయించవచ్చును.

ప్ర:-ఇప్పటి మంత్రులే ఉంటే రాజకీయాల్లో తగాదాలు రావా?

స:-మరి వెంటనే ఎన్నికలు జరుపడానికి ఏర్పాటు ఏమీ లేదు. ఇపుడున్న సమష్టి మంత్రివర్గం విడివడి ఆంధ్రమంత్రులే ఆంధ్రప్రాంతముల పాలించవలసిఉండును. అది 1950 ఏప్రిల్ ఒకటవ తేదీనుంచి జరగవచ్చును. లేదా వచ్చే ఎన్నికలవరకు ఇప్పటి సమిష్టి మంత్రివర్గమే ఉండవచ్చును. వచ్చే ఏప్రిల్ నుంచి మంత్రివర్గం వేరుపడిపోతే ఈ విభజన వ్యవహారం సులభం అవుతుంది.

ప్ర:-మీ దారికి అడ్డుగా ఏమన్నా అంతరాయాలు కనిపిస్తున్నాయా?

స:-నాకేమీ కనిపించడంలేదు. సరిగదా అన్ని ప్రాంతాలవారి సంపూర్ణ సహకారం లభించగలదని ఆశిస్తున్నాను. తమిళుల స్నేహితుల సహకారం కొల్లలుగా ఉన్నది. కన్నడులతో వారు చెప్పిన ప్రకారమే చెయ్యడానికి వప్పుకున్నందున వారికా క్షేపణ ఉండవని లేదు. మళయాళీలు మాకు పొరుగు వారు కాదు.

ప్ర: చెన్నపట్నంపై హక్కు వదలుకోవాలంటే పరిహారం మాట ఏమాతుంది? హక్కు లేదంటే పరిహారం ఎల్లా వస్తుందని అంటే?

స: హక్కు వదలుకోవాలంటే తమిళులతో సమరసభావంతోను, స్నేహంతోను వ్యవహారంపరిష్కారంచేసుకోవడానికిని గాని వారావిధంగా కాదు. ఆర్థికవ్యవహారాలన్నీ పరిష్కారంచేసుకొన్నప్పుడు అన్ని విషయాలు పరిష్కారం అవగలవు.

#### హైద్రాబాదు

ప్ర:- హైద్రాబాదులోని తెలుగు జిల్లాలు ఎనిమిదిఆంధ్రరాష్ట్రంలో చేరినప్పుడే ఆంధ్రరాష్ట్రం పూర్తి అవుతుందిగదా?

స:- తెలంగాణా సంగతి నిర్ణయించవలసింది కేంద్రంలోని సంస్థాన మంత్రివర్గం. 80 లక్షలమంది ఆంధ్రులు హైదరాబాదులో ఉన్నారన్నమాట 8 తెలుగుజిల్లా లన్నమాట వాస్తవం. గుంటూరు కృష్ణా, పశ్చిమ గోదావరులకు ఆనుకొని ఈ ప్రాంతమంతా ఏకఖండంగా ఉన్నది. వారు ఆంధ్రరాష్ట్రంలో ఎప్పుడు చేరేదీ వారే నిర్ణయించాలి. ఎప్పుడు చేరినా చేరవచ్చు.

#### పట్నం ప్రత్యేక రాష్ట్రం సంగతి

ప్ర:- చెన్నపట్నం వదలుకోవాలంటే ఆంధ్రులు ప్రతిఘటించడం లేదా? ప్రత్యేక రాష్ట్రంగా యెందుకు ఉంచుకోరాదు? చెన్నపట్నం భవిష్యత్తు ఏమి?

స:- వదలుకోవాలన్నప్పుడు నిబిడీకృతమైన ప్రతిఘటన సర్వత్రా కనిపిస్తున్నది. అయితే అది నైతికమైనది. చెన్నపట్నంకోసం రాష్ట్రం వదలుకోవటమా? లేక రాష్ట్రంకోసం పట్నం వదలుకోవడమా అనే ధర్మసంకటం వచ్చింది. చెన్నపట్నంపై హక్కు వదలుకుంటేనే గాని రాష్ట్రం వచ్చే యుక్తి లేనందున వెంటనే రాష్ట్రం కావాలంటే ఆంధ్రులకు అంతకన్న గత్యంతరంలేదు.

ఇక ప్రత్యేకరాష్ట్ర నిర్మాణం సంగతి ఇప్పటికి ప్రస్తుతంగాదు. భవిష్యత్తులో అనేక పరిస్థితులపై ఆధారపడిఉన్నది. మద్రాసుహార్బరు ఇప్పటిమాదిరిగానే ఉంటే చెన్నపట్నానికి భవిష్యత్తులేదు. హార్బరు అభివృద్ధిఅయితే మంచిభవిష్యత్తు ఉన్నది. నన్ను మద్రాసు భవిష్యత్తును గూర్చి మీరు జోస్యం చెప్పమంటున్నారు. చెన్నపట్నాన్ని ఆంధ్రులు వదులుకున్నప్పుడు దేశమధ్యస్థంలోకి మధుర, కో, తిరుచునాపల్లి కో రాష్ట్రాన్ని మార్చుకుందామని తమిళులు యత్నింపవచ్చును. సంస్కృతినిలయానికి అంటే సంస్కృతి అభివృద్ధి అయ్యే ప్రదేశానికి రాజధానీ నగరం మారాలని ఉండడం సహజం. బొంబాయి సంగతి అంటారా 13 భాషలు ఉన్నాయి. బొంబాయిఇస్తేనే గాని మాకు రాష్ట్రం వద్దని మహారాష్ట్రులు అంటున్నారు. తెనుగువాళ్లు అనటంలేదు. చెన్నపట్నం ఇస్తేగాని రాష్ట్రం వద్దు అనడం లేదు. చెన్నపట్నంలో 7, 8 భాషలు ఉన్నవి. ఇది సంస్కృతి కేంద్రంగా విరాజిల్లడం లేదు. సంస్కృతీ పరుల పిపాసను తీర్చడంలేదు. అందువల్ల రాజధాని నగరాలు సంస్కృతీవిరాజితములైన ప్రదేశములకు మారడం న్యాయం.



చెన్నపట్నాన్ని ఆంధ్రులు వదులుకున్నారంటే భవిష్యత్తులో ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యరావని ఎక్కడా లేదు.

కేరళ, కన్నడ రాష్ట్రాల నిర్మాణము ఆయా భాషాప్రాంతాలు, ఆయా సంస్థానాలు ఎంత శీఘ్రంగా చేరితే అంత త్వరితంగా ఆ రాష్ట్రాలు ఏర్పడతాయి అన్నారు.

ఆంధ్రదేశంలో కమ్యూనిజం, దక్షిణదేశంలో ఫాసిజం పెరుగుతున్న వనీవాటిని గట్టిగా అణచివెయ్యవలెననీ మరోప్రశ్నకు సమాధానంగా చెప్పిరి. సత్యాహింసలమీద ఆధారపడిన దౌర్జన్యరహితమైన కమ్యూనిజమును ఎన్నటికీ వాంఛనీయమేఅనీ, గాంధీమతము అదే అనీ పట్టాభిగారు చెప్పిరి.

## భారతదేశం ఆహారధాన్యం విషయంలో పదేళ్లలో స్వయంసమృద్ధం కాగలదు

### -మారిస్ డాడ్ విశ్వాసం

వాషింగ్టన్, ఏప్రిల్ 2?: భారత ప్రభుత్వమువారు తమ ప్రస్తుత పథకములను కొనసాగించినయెడల పది సంవత్సరములలో భారతదేశము ఆహారవిషయమున స్వయం సమృద్ధము కాగలదు. దీనియర్థము భారతదేశము తనకు కావలసిన ఆహారమునంతటిని ఉత్పత్తి చేసికొనగలుగునని కాదు. తాను దిగుమతి చేసికొనవలసిన వస్తువులకు కావలసిన ధనము వ్యవసాయమువల్ల పండినవస్తువుల ఎగుమతివల్ల లభించునని దీనియర్థము అని ఐక్యరాజ్యసమితి ఆహార వ్యవసాయసంస్థ డైరెక్టరు జనరలు, ప్రపంచ పర్యటనము ముగించుకొని యిప్పటికి తిరిగివచ్చిన వారు నేడు చెప్పిరి.

ఆహారోత్పత్తిని మనము వాంఛించునంతగా హెచ్చించుటకు అవసరమైన సాంకేతికవిషయ జాలము యిప్పుడు ప్రపంచములోకలదని ఈ శాస్త్రజ్ఞానమును రయితులకు అందజేయవలసి యున్నదని ఆయన చెప్పెను. భూమిని, ఇతర ఉత్పత్తి సాధనములను సరిగా ఉపయోగించుకొనకపోవుటవల్ల భారతదేశము విశేషముగా విదేశములపై ఆధారపడవలసి వచ్చుచున్నదని, భారతదేశమునకు టెక్నిషియన్లు, విదేశములవారి ద్రవ్యము అవసరమని డాడ్ గారు చెప్పిరి. 'ఇప్పుడు భారతదేశము సంవత్సరమునకు 40 లక్షల టన్నుల ఆహారధాన్యములను ఎగుమతి చేసికొనుచున్నది. 10 సంవత్సరములలో ఈ దిగుమతులను భారతదేశము తగ్గించుకొని సంవత్సరమునకు 15 లక్షల టన్నులు మాత్రమే దిగుమతిచేసుకొన వీలగును. ఈ 15 లక్షలటన్నుల దిగుమతికి అగుఖర్చును భారతదేశము భరింపగలుగునని నేను నమ్ముచున్నాను' అని డాడ్‌గారు చెప్పిరి. ఉత్పత్తి హెచ్చించుటకు భారతదేశము సర్వప్రయత్నములు గావించుచున్నదని ఆయన చెప్పెను. భారతదేశమునకు టెక్నిషియను విదేశీయుల ద్రవ్యంసహాయము అవసరమని డాడ్‌గారు చెప్పుచు వెనుకబడిన దేశములకు సహాయము చేసెదమని అధ్యక్ష ట్రూమెన్ ప్రకటించిన కార్యక్రమము వల్లనే ఈఅవసరములు తీరగలవనిరి.

### మద్యనిషేధ మంత్రుల సమావేశము

మదరాసు, ఏప్రిల్ 21: రాష్ట్రములలోని మద్యనిషేధమంత్రుల సమావేశము మే 15 ప్రాంతములో న్యూఢిల్లీలో జరుగునని తెలియుచున్నది. ఇండియా ప్రభుత్వ ఆరోగ్యమంత్రి వర్గమువారు ఈ సమావేశమును ఏర్పరచుచున్నారు.

మద్యనిషేధ మనులు జరిపెన రాష్ట్రములలో పని ఎట్లు జరుగుచున్నదీ పరిశీలించుటకు ఈ సమావేశ మేర్పాటు చేయబడినట్లు తెలియుచున్నది.

## వేలం నోటీసు

విశాఖపట్టణము వాస్తవ్యులైన శ్రీ రెడ్డి సన్యాసయ్యగారికుండి రావల సిన ఇన్‌కంటాక్సు రాబట్టు కొనుటకుగాను, 27-4-49 తేది ఉదయము 11 గంటలకు విశాఖపట్టణం తాలూకా ఆఫీసులో, విశాఖ పట్టణము తహశీల్దారు గారి చే, ఈ క్రింది ఆస్తులు బహిరంగ వేలాములో అమ్మబడును.

(1) ఒక ఫోర్డు లారీ MDV 302.
(2) ఒక డాడ్జి కారు MDV 710.
(3) ఒక రెమింగ్టన్ టైప్‌రైటరు.
(4) రెండు బీరువాలు.
(5) రెండు ట్యాటరీలు.

(సం.) ఎస్. కృష్ణమూర్తి,
తహశీల్దారు.



# పాతచట్టాల పునరామోదం బిల్లు సెలక్టు కమిటీకి నివేదన

## రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదం

చెన్నపట్నం, ఏప్రిల్ 21: రాష్ట్ర కౌన్సిల్ నిన్న ఉదయం ఆర్. బి. రామకృష్ణరాజు గారి అధ్యక్షతను సమావేశమైంది. మాజీ ప్రధాని శ్రీ ఓమాండూరు రామస్వామి రెడ్డిగారు హాజరు కాలేదు. హోజనైనమాజీమంత్రి గురుపాదంగారు తాసీమా ప్రకటన చేయుటం లేదనిఅన్నారు.

సరోజినీదేవి మరణమునకు విచారం తెల్పుచు యీసభ తీర్మానించినందుకు కృతజ్ఞత చెల్పుచు, సం|| రాష్ట్రముల ప్రధానియు, సరోజిని కుమార్తెయు పంపినసందేశములను అధ్యక్షులు ప్రకటించిరి.

నేడు అధికారేతర కార్యక్రమానికి బదులు ప్రభుత్వకార్యక్రమం చర్చించాలని సభానాయకుడు డా|| రాజనుగారొక తీర్మానం ప్రతిపాదించి, అధ్యక్షులు కోరగా కారణములు తెల్పుచు ప్రభుత్వకార్యములు చాల మిగిలిపోయినవనియు, అవి ముగిసినాక అధికారేతర కార్యక్రమం కూడ చర్చించెదమనిరి.

ఈ నెలాఖరులోగా, ప్రాతచట్టములు పునరుద్ధరణచట్టం గావించి గవర్నరుజనరలు అనుమతి పొందాలి కనుక, యివి ముందు చర్చించాలని మంత్రి మాధవమీననుగారనిరి.

డా|| జానుగారు ఏప్రిలులో 20 రోజులవరకు సభ సమావేశపరుచక బుధవారం నాడే సమావేశపరచి, అధికారేతర కార్యక్రమం అడ్డుకొట్టుట ఆక్షేపణీయమనిరి. ఇట్లు ప్రతిసారిచేయరాదనిరి.

ప్రభుత్వ కార్యక్రమమే ప్రధానమయినదనియు, అధికారేతర సభ్యుల కార్యక్రమం అప్రధానమయిందని మంత్రులనరాదని ఫరూకిసాహేబుగారనిరి.

అధ్యక్షులు—ప్రభుత్వం వారు తమ కార్యక్రమం ఉన్నరోజునకూడ అధికారేతర, కార్యక్రమంకూడ జరుప అంగీకరించిరనియు, ఏప్రిలు మొదటివారంలో శాసనసభాధ్యక్షులు ఢిల్లీ పోవలసివచ్చినందున సభ యింత ఆలస్యంగా జరుగవలసివచ్చిందనియు, చెప్పిరి. ప్రభుత్వ కార్యక్రమము తీసుకొనుటకు అంగీకరించబడిన తరువాత శ్రీ కె. మాధవమీనన్‌గారు 18 సభ్యులతోకూడిన (అసెంబ్లీ నుండి 12 కవున్సిల్‌నుండి 6) సెలక్టు కమిటీని మదరాసు చట్టముల (పునరామోదించు) బిల్లు పరిశీలన నిమిత్తము నియమించవలసినదిగ ప్రతిపాదనచేసిరి.

మదరాసు సిటీపోలీసుచట్టము పఠానుల అప్పులొసగినవారిని బాధపెట్ట వీలులేక చేయుటకు సవరింపదలచియున్నట్లు చెప్పిరి. ఏమైనా రెండుస్థానికసంస్థలకు తగాయిదా లేర్పడి ఆవిషయమై ప్రభుత్వమేదైనా తీర్పునిచ్చితే వెనుకటి చట్టముప్రకారము ఆతీర్పును తిరిగి పరిశీలించవలెనని అడుగటానికి వీలేకుండెననియు యిపుడు సవరింపదలచిన మదరాసు స్థానికసంస్థల సవరణ బిల్లునందు యీ అవకాశము యుండవలదనిరి.

డా|| వి. కె. జాన్‌గారు మదరాసుసిటీ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టు చట్టము ఒకఏడాదికి కాకుండా శాశ్వతముగా శాసనం చేయవలెనని కోరిరి. ప్రజాప్రభుత్వముప్రైమరీ విద్యను బాగా వ్యాపింప జేయ ఎలచేటట్టయితే 1941 సంవత్సరంలో విదేశీయ ప్రభుత్వము స్థానికసంస్థలు వసూలు చేసే విద్యా సుంకమునకు పరిసమానమైన గ్రాంటునిచ్చే బాధ్యతను వదులుకొంటూ గావించిన ఎలిమెంటరీ విద్యా చట్ట సవరణ బిల్లును తిరిగి శాశ్వతముగా శాసనము చేయుటకుబదులు దానిని మానివేయవలెనని కోరిరి.

శ్రీ భీమరావుగారు శాసనసభవారు చట్టములను బాగా పరిశీలించి శాసనములు చేయవలెననియు యీ విషయములో తొందరపడుట మంచిదికాదనియు శాసనసభలో ప్రవేశపెట్టే అన్ని బిల్లులను ప్రధాన న్యాయమూర్తి సూచించిన మాదిరి ముందుగా ఒక న్యాయశాస్త్ర నిపుణుల కమిటీ పరిశీలించి నివేదించేట్టయితే అవసరమైన చట్టములు తయారగుటకు వీలుకలుగునవియు ప్రభుత్వము ప్రధాన న్యాయమూర్తి సూచనను అనుసరించుట మంచిదనియు సూచించిరి.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు 1941 సం|| మదరాసు ఎలిమెంటరీ విద్యా సవరణ చట్టమును అప్పటి ప్రభుత్వము గావించి నప్పటినుండి ఎలిమెంటరీ విద్యావ్యాప్తి ఏమాత్రం అభివృద్ధి కాకుండా స్తంభించి పోయినదనియు ఎలిమెంటరీ విద్యావ్యాప్తి బాగా జరుగవలెనంటే ఆ శాసనమును తప్పక రద్దుచేయవలెననియు సూచించిరి ఎలిమెంటరీ విద్యావ్యాప్తికై స్థానిక సంస్థలకు విశేషముగా ధన సహాయ మిచ్చుటకు ప్రభుత్వము పూనవలెను. గాని వాటికి అట్టి సాహాయ్యం లేకుండా చేయుట సమంజసము కాదనిరి.

మంత్రి మాధవమీనన్ గారు సిటీ యింప్రూవ్‌మెంటు చట్టము వేరే సమయమున యింకొకశాసనమును ప్రభుత్వము చేయదలచియున్నందున యీశాసనమిపుడు తాత్కాలికముగా ఒకయేడాదివరకు నుండుటకు తలపెట్టబడెననిరి. ఎలిమెంటరీ విద్యా చట్టము సవరణబిల్లును ప్రభుత్వము తమ ఆర్థికస్థితి ఆలోచనలకు తీసుకొని పైబిల్లును తిరిగి శాసింపవలెంచియున్నదనియు, యే స్థానిక సంస్థలైనా ప్రభుత్వ ధనసహాయము లేకపోయిననూ విద్యాసుంకము విధింప దలచేయెడల అట్టివిధింపునకు అవకాశము తప్పక యుండితీరుననియు, యిదివరకు ప్రభుత్వము స్థానికసంస్థలకు గ్రాంటుల మూలమున చేస్తున్న సహాయము యేమాత్రము ఆగిపోదనియుకూడా నుడివిరి.

కాలదోషం పట్టిన శాసనముల పునరుద్ధరణ బిల్లు ఉభయశాసనసభల జాయింటు సెలెక్టుకమిటీకి నివేదించుటకు సభ వారు ఆమోదం తెలిపిరి.

### ఆలయ ప్రవేశసవరణ చట్టము

రాష్ట్రంలో కొన్ని మతములవారికి కొన్ని ప్రత్యేకదేవాలయాలుకలవు. వాటిలో అట్టి తెగవారుమాత్రమే ప్రవేశించి దైవపూజ చేస్తున్నారు. ఈ దేవాలయాలలో సయితము అన్నితెగల హిందువులకు ప్రవేశాధికారమిచ్చే బిల్లును మంత్రి మాధవమీనన్‌గారు ప్రతిపాదించగా విశేష చర్చ లేకుండా కౌన్సిలు సభవారు దానిని శాసనముగా ఆమోదించిరి.

### తంజావూరు సత్రముల ధర్మములను ఉపయోగించుకొను బిల్లు

పై బిల్లును ప్రవేశపెట్టుచూ శ్రీ మాధవమీనన్‌గారు యిట్లనిరి. తంజావూరులో పూర్వకాలం రాజులు రామేశ్వరంపోయే యాత్రికులనిమిత్తం కొన్ని సత్రములను ధర్మముగా స్థాపించియుండిరి. ఇపుడు రామేశ్వరం వెళ్లే యాత్రికులు వేరే మార్గములలో వెళ్లుచుండబట్టి పై సత్రముల ధర్మనిధి వ్యయముకాకుండా నిలవగా యుండిపోయినందున ప్రభుత్వము ఆ ధర్మసొత్తులను తీసుకొని సంస్కృత పాఠశాల, ఆసుపత్రి, హరిజన్ హాస్టెలు మున్నగు ప్రజోపయోగకరమైన కార్యములను నిర్వహిస్తున్నారు. ఇట్టి కార్యములకు పై సత్రముల ధర్మనిధులు ఉపయోగపడుటకు వీలుకలిగించే నిమిత్తము ప్రభుత్వము ఈ సవరణ బిల్లును ప్రవేశపెట్టినట్లు చెప్పిరి.

శ్రీ భీమరావు, శ్రీ నటరాజన్ గార్లు మొదట యీ ధర్మములను స్థాపించిన స్థాపకుల ఉద్దేశ్యమునకు భంగకరమైన పనులకు ఆ ధనమును సొత్తును ఉపయోగించుకొనుట ధర్మము కాదని ఆక్షేపించిరి.

[మధ్యాహ్నం ఒంటిగంటకు ప్రధాని శ్రీ పి. ఎస్. కుమారస్వామి రాజాగారు కౌన్సిలులోకి వచ్చి కూర్చున్నారు.]

మంత్రి మాధవ మీనను గారు విమర్శలకు సమాధానముగా యీసత్రముల స్థాపకుల ఉద్దేశ్యమేమో ప్రభుత్వము వద్ద గల పత్రముల వల్ల విదితముగా తెలియనేవనియు యీ సత్రముల ధర్మములనుండి సాలుకు దాదాపు రూ 3లక్షల ఆదాయమున్నదనియు ఆ సొత్తును దుర్వినియోగము లేకుండా చూచుటకు యీబిల్లు చాలా అవసరమనియు పలికిరి. ఆపైని సభవారు బిల్లును శాసనముగా ఆమోదించిరి.

అంతటితో సభ మధ్యాహ్నానికి వాయిదా వేయబడెను.

### మధ్యాహ్నం కార్యక్రమం

కౌన్సిలుసభ మధ్యాహ్నం ఫలహారానంతరం సమావేశమైనపుడు మంత్రి మాధవమీనన్‌గారు పశ్చిమ గోదావరి జిల్లాలో మినహాయింపబడియుండిన కొన్ని గ్రామాలకు సయితం రాష్ట్రీయ శాసనములను వర్తింపచేయుబిల్లును అసెంబ్లీలో ఆమోదింపబడిన విధముని కౌన్సిలువారు కూడా శాసనముగా ఆమోదించవలెనని ప్రతిపాదించగా సభవారు ఆమోద మొసంగిరి. స్థానిక పరిపాలనా మంత్రి శ్రీ కే. చంద్రమౌళిగారు మదరాసు సహకార సంఘముల సవరణ బిల్లును ప్రతిపాదించిమైసూరు సంస్థానములో సహకార సంస్థల మీద నొసగబడే అవార్డులను అక్కడే అమలు పరుప వీలగునట్లు చేయు ఉద్దేశ్యముతో యీ బిల్లు వేయబడినదని చెప్పిరి. సభవారు యీబిల్లును కూడా ఎట్టి చర్చలేకుండా శాసనముగా ఆమోదించిరి.

అనంతరము శ్రీ టి. యం. అబ్దుల్ ఇబ్రాహీముగారు ముస్లిం వివాహ శాసన బిల్లును ప్రతిపాదించిరి.

డా|| వి. కె. జాన్‌గారు దేశములో వుండే అన్ని జాతుల వారికి ఒకే విధమైన వ్యక్తిగత న్యాయశాస్త్రములు యుండుట అవసరమనియు ముస్లిములకు గాని యే యితర జాతికిగాని ప్రత్యేక వ్యక్తిగత శాసనము లుండుట విశేషాలకు కారణము

ల ను స ని యు అం దు వ ల్ల యిట్టి శాసనములను చేయుట శ్రేయస్కరము కాదనిరి.

మంత్రి మాధవమీనన్‌గారు మాట్లాడుచూ డా|| జాన్‌గారు చెప్పిన ప్రకారము దేశప్రజలందరికి ఒకేవిధమైన శాసనము లుండవలెననుట ఆదర్శమైన భావమే కాని అట్టి మహోన్నతస్థితి కలిగేవరకుయీవ్యక్తిగతశాసనములు కొన్ని జాతులకు ఆచారము లనుసరించియుండవలసి యున్నదనిరి.

డా|| తాజుద్దీన్‌గారు బిల్లును బలపరచిరి.

ఫరూకీగారు బిల్లు రెండ క్లాజులో దత్తత విల్లులు, ఆక్షేపణలు చేర్చవలెనని సవరణ ప్రతిపాదించిరి.

సవరణమీద ఓటింగు సందర్భములో పోలుకోరబడగా 10 గురు ప్రతికూలముగను 9 మంది అనుకూలముగను ఓటుచేయగా సవరణ వీగిపోయెను.

అనంతరము బిల్లుశాసనముగా సభ వారిచే ఆమోదింపబడెను.

అంతటితో కౌన్సిలు సమావేశమును ఏప్రిల్ 22 వ తేదీ మధ్య 4 గంటలవరకు అధ్యక్షులు వాయిదా వేసిరి.

## పరిశ్రమలకు సహాయం

1948-49 సం||లో 82 పరిశ్రమలు ప్రభుత్వంవారి ధనసహాయానికి దరఖాస్తులు పెట్టినవి. అందు 2 ఉపసంహరించుకొన్నవి. వాటిలో 193 స్టేటు ఎయిడు చట్టం ప్రకారం ధనసహాయ మొసంగబడెను. 1947లో ఒకటి, 1948లో రెండు రంపపు మిల్లులు ధనసహాయము కోరినవి కాని యింకను పరిశ్రమల బోర్డువారు వాటినిగూర్చి విచారించ లేదని పరిశ్రమల మంత్రిగారు మోతే నారాయణరావు గారి ప్రశ్నకు కౌన్సిలులో బదులు చెప్పిరి. గృహపరిశ్రమలు యిందు చేరినవా యని అడుగ చట్టంప్రకారం యివ్వదగ్గ పరిశ్రమలకు ధనసహాయమిచ్చితి మనిరి.

### సుఖరోగ నివారణ

రాష్ట్రంలో సుఖరోగ నివారణ గూర్చి ప్రచారము మాజికులాంతర్లు ఫిల్ముల ద్వారా ఆరోగ్యశాఖవారు చేయుచున్నారనియు, స్థానిక సంస్థలకు యీ ఫిల్ములు యిస్తున్నారనియు,ప్రయివేటు వాలంటేరు సంస్థలు యీ ప్రచారం చేయుటకు పిల్వ పడుచున్నవనియు, ఏమైనా ఉంటే ప్రభుత్వంవారు వలయు సౌకర్యములొసంగెదరనియు ఆరోగ్యశాఖ మంత్రి ఎ. బి. షెట్టిగారు, క్లబువాలాపతికి బదులు చెప్పిరి. ఏజిల్లాలో యీ జబ్బు ఎక్కువగా నుందని ఆదిత్యను గారడుగ, ఆస్పత్రిలెక్కల ప్రకారం సంటూరు జిల్లాలో ఎక్కువగాను, ద. కనరాలో అన్నింటికన్న తక్కువగా నుందని చెప్పిరి.

## మదరాసు అసెంబ్లీ ఉప ఎన్నిక

చెన్నపట్నం, ఏప్రిల్ 20: అసెంబ్లీలో యూరోపియన్ వాణిజ్యసంఘముల నియోజకవర్గ ప్రతినిధిగా నుండిన ఇ. ఏవాట్సన్‌గారు రాజీనామానిచ్చినందువల్ల ఏర్పడిన ఖాళీస్థానమును భర్తీచేయుటకు యీ క్రింది తేదీలు ఎన్నికకుగాను నిర్ణయింపబడినవి. మే 9 నామినేషనుకు ఆఖరు తేదీ. మే 11 నామినేషన్ల పరిశీలన జూను 8 పోలింగు జూను 11 ఓట్ల లెక్కింపు.

## ప్రొద్దుటూరులో మంచినీటికోసం ప్రజలపాట్లు

### ఎలెక్ట్రిసిటీ సరఫరాలేక ఇబ్బందులు

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 18: ఈ సంవత్సరము ఇచ్చట వేసవి చాల అధికముగనున్నది. దీనికితోడు కొళాయిలలో నీటి సరఫరాచాల తక్కువ. జనులు తెల్లవారుఝాము నుండియు వారి కంతులైన బిందెలు మొదలయినవాటిని కొళాయిల వద్ద చేర్చియుండుటయు వంతులకై కొట్లాడుటయు చూడ విచారము కలుగును, పట్టణములోని కొద్దిబావులు చాలకాలము నుండి వాడకుండుటను బట్టి వాటినీరు త్రాగుటకు యోగ్యముకాకున్నది. నీరున్నప్పటికిన్ని ప్రజలు నీటికరవును అనుభవించుచున్నారు. గత రెండుమూడు రోజులుగా ఇంజన్ చెడిపోవుట వల్ల హఠాత్తుగా కొళాయిల నుండి నీటి సరఫరా ఆగిపోవడం చేత నీటికై ప్రజల కష్టం అతీతమై పోయినది. గోరుచుట్టుపై రోకలి పోటన్నట్లు విద్యుచ్ఛక్తి సరఫరా సైతము బొత్తుగా లేక పోవుటయు, లేదా నెలలో యే కొద్దిరోజులైనను కొన్ని నిమిషములో గంటలో వుండుటయు, వుండిన రోజులలో కూడ కొన్ని భాగములకు సరఫరా బొత్తుగా లేకుండుటయు, చీకటి రాత్రులందు సయితము ముఖ్యమైన కేంద్రస్థలములందు సయితము దీపములు లేకుండుటయు చిక్కులి యిబ్బందుల కలుగ జేయుచున్నవి. (స్వ. వి.)

కొత్తపేటలో కోటిపల్లి బస్సు స్టాండు (మునిసిపల్)వారు శ్రీ రామనవమి ఉత్సవాల సంవత్సరంలో ఏప్రిల్ 17 న సుమారు 2000 మంది పేదలకు అన్నదానం చేయించారు.

# సంయుక్తరాష్ట్రంలో రైతుల సత్యాగ్రహం

## ధాన్యసేకరణ విధానంపట్ల నిరసన

లక్నో, ఏప్రిల్ 20: సంయుక్త రాష్ట్రాలలో జరుగుతున్న నిర్బంధ ధాన్య సేకరణ విధానం పట్ల నిరసన తెలియ జేయటానికి నేడు లక్నో పరిసర గ్రామాల నుండి 10 వేలమంది రైతులు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ భవనం దగ్గరకు నిరసన యాత్రజరిపిరి. లక్నోకు 20మైళ్ల చుట్టు ప్రక్కల ఉన్న రైతులు సోషలిస్టుపార్టీ ఆధ్వర్యాన యాత్రలు చేసుకుంటూ నేటి ఉదయం ప్రభుత్వ భవనమునకు వచ్చిరి. ప్రదర్శనమునకు సోషలిస్టు నాయకులగు డా|| రాం మనోహర్ లోహియా, సేట్ దామోదర్ స్వరూప్‌గార్లు ఆధ్వర్యము వహించిరి. ఈవిధంగా రైతులు నిరసనయాత్ర జరపటానికి లక్నో చరిత్రలో ఇదే మొదటిసారి.

రైతులంతా గాంధీ టోపీలను పెట్టుకుని కర్రలను పట్టుకునివచ్చిరి. పంటలు సరిగాలేవని జ్ఞాపకంచేయటానికి వారిలో కొందరు చేతులలో ధాన్యపు కంకులను పట్టుకున్నారు. రాత్రంతా చుట్టుపక్కల ప్రాంతాలనుంచి రైతులు వస్తునే ఉన్నారు. ఊరేగింపునంబడి పోలీసులు ఉన్నారు. వారు సెక్రటేరియట్ భవనాన్ని సమీపించి 12 అడుగుల ఎత్తున ఉన్న గోడనుదూకి ఆవరణలో ప్రవేశించి, ప్రధానినికాని, ఆహారమంత్రినికాని, చూడవలెనని శాంతంగా వేచిఉన్నారు. అక్కడ వారంవరినీచూస్తే ఒకపల్లెటూరి సంత కోలాహలంగా ఉన్నది.

కొంతసేపటికి ప్రధాని గోవిందవల్లభ పంత్‌వచ్చి గ్రామాల్లో ప్రభుత్వోద్యోగులు ఉండగా, కాంగ్రెస్ సేవకులుండగా ఇంత దూరం రైతులెందుకువచ్చారని ప్రశ్నించెను. పల్లెల్లోమాగోడు వినేవారు కనిపించలేదని రైతులు కేకలువేసిరి. అంతట ఆయన ధాన్యసేకరణ విధానం పట్టణప్రజలను పోషించటానికని వివరించి ఇది సంతృప్తిగా ఉన్నదనుకునే వాళ్ళను చేతులెత్తమని ఆయన కోరగా చాలాకొద్దిమంది మాత్రమే ఎత్తిరి. ఎవ్వరూ చేతులెత్తలేదు. చూడమని ఒకరు కేకలేయగా, 'మీరంతా చేతులెత్తకుండా అడ్డుపడుతున్నారని' ఆయన గద్దించెను. ఎవ్వరికీ సేకరణ విధానం ఇష్టంలేదని మరికొందరు కేకలు వేసిరి. 'మీరు గోల చేయటానికే వచ్చినట్లున్నదని' ఆయన విమర్శించగా వారి నాయకులాయనను తిరిగి విమర్శించి యు. పి. ప్రభుత్వాన్ని మాదారికి తిప్పుతాము" అని ప్రకటించిరి.

## తూర్పుగోదావరి ధాన్య సేకరణ

తూర్పు గోదావరిజిల్లాలో ధాన్య సేకరణగూర్చి టి. పురుషోత్తంగారు అడుగగ, కౌన్సిలులో ఆహారశాఖ మంత్రిగారు యీ దిగువ సంఖ్యలు తెలిపిరి: 1946-47 సం|| బియ్యం 121,500, 1947-48 లో 116,174 ట. 1948-49 110,600 ట. సేకరించుటకు కోటాలు నిర్ణయించిరి.

సేకరించబడిన సరకు: 1946-47 నుండి వరుసగా మూడేండ్లలో 91,741 ట. 104,565 ట. 40,826 ట. సేకరించిన వాటిలో పై జిల్లాకు ఎగుమతి చేయ బడిన సరకు: 82,461 ట. 61,718 ట, 22,539 ట.

1948 నవంబరునుండి 49 జనవరి ఆఖరు వరకు 27,439 ట. బియ్యం సేకరించ బడినవి. అందు 14,687 ట. ఎగుమతి చేయ బడినవి.

## రా. స్వ. సే. సంఘ నాయకునికి స్వాగతం

నరసారావుపేట, ఏప్రిల్ 16: స్థానిక రాష్ట్రీయ స్వయంసేవక సంఘ నాయకుడు పాలపర్తి ఆంజనేయులుగారు బళ్లారి జెయిలునుండి విడుదల అయి నిన్న యిచ్చటికి రాగా స్థానికసంఘ సభ్యులు ఆయనకు రైలుస్టేషనువద్ద స్వాగతమిచ్చి, మేళతాళాలతో ఊరేగించిరి.

ఇచ్చట ఈసంవత్సరము శ్రీ రామకల్యాణము సుమారు 20 ప్రదేశములందు చక్కగా అలంకరించిన పందిళ్ళలో జరుపబడెను. ఈవారమంతయు, హరికథలు, పాటకచేరీలు, పేదలకు అన్నదానములు జరిగెను.

హృషీకేశ ఆశ్రమవాసి శ్రీ రాములాల్ మహరాజ్ గారి 61 జన్మదినోత్సవము యిచ్చట యీ నెల 7, 8, 9 తేదీలలో వారి భక్తులచే జరుపబడెను. శ్రీ వారి పతి సుభద్రాదేవి, వారి శిష్యులు సీరుగంటి నరసింహముగారి మొదలగు పెద్దలు యీ ఉత్సవమునందు పాల్గొనిరి. కొందరు పెద్దలు శ్రీరామనామ మహిమగూర్చి బోధించి, సందేశములు నరించి ఉపన్యసించిరి.

# కలకత్తాలో పిల్లల దొంగతనాలు

## ప్రజల అనవసర ఉద్రేకఫలితంగా అమాయకుల మృతి

కలకత్తా ఏప్రిల్ 20: కలకత్తాలో ఇటీవల చిన్నపిల్లల దొంగలు అధికమై, అనేకమంది పిల్లలు తప్పిపోతున్నారు. ఈ దొంగలను పట్టుకునేందుకై ప్రజలు మరీ విపరీతంగా ప్రవర్తించుచున్నందున, కొందరు అమాయకులుకూడా బాధింపబడుచున్నారు. గత సాయంత్రం శ్యాంబజారులో ఒక 60 ఏండ్ల బిచ్చగాడు ప్రజల రాళ్లవర్షంలో పడి మరణించెను.

బేహాలాలో గతరాత్రి ముగ్గురిని ప్రజలు పట్టుకుని చితకబాదిరి. ఇంతలో పోలీసులు వచ్చి వారిని రక్షించిరి కాని ఒకడు మాత్రము కొంతసేపటికి చనిపోయెను.

కలకత్తా దక్షిణభాగంలో మరొకని నిల్లాగే ప్రజలు బాగాకొట్టిరి. అతనిని కాపాడవచ్చిన భార్య, దాసీలకుకూడా దెబ్బలుతగిలినవి. ఇంకా అనేకచోట్ల పలువురు వ్యక్తులు ప్రజలచే నానాహింసలకులోనైరని వార్తలు వచ్చినవి.

నేటి మధ్యాహ్నం కలకత్తా మధ్య ప్రాంతంలో ఒకపిల్లలదొంగను పోలీసులు బంధించిరి. పిల్లల దొంగలు ముఠాలు కట్టి తిరుగుతున్నారేమో కనిపెట్టుటకు కలకత్తా పోలీసు అధికారులొక అపరాధ పరిశోధకుని నియమించిరి. ప్రజలు శాంతంగా ఉండవలెనని, దొంగలను పట్టుకొనుటకు అన్ని ప్రయత్నములు చేయుచున్నామని కూడ వారు ప్రకటించిరి.

# వైద్య సహాయక సమితి

## అమృత కౌరు ప్రారంభించింది

న్యూఢిల్లీ, ఏప్రిలు 21: ఏడాది పొడుగునా ఫాక్టరీలలో పనిచేసే 25 లక్షల మంది పనివారి సౌకర్యార్థం ఏర్పరచబడిన ప్రభుత్వ భీమాసంస్థ తాలూకు వైద్యసహాయక సమితిని నేడు ఆరోగ్యమంత్రి రాజకుమారి అమృతకౌరు ప్రారంభించారు. ఈ సమితిలో 21 మంది సభ్యులున్నారు. ఇందులో రాష్ట్ర వైద్య శాఖల నిర్వాహకులందరూ సభ్యులు. ఇండియా ప్రభుత్వ వైద్య ఆరోగ్యశాఖల డైరెక్టరు జనరలు దీనికి అధ్యక్షుడు.

పనివారి ప్రభుత్వభీమాసంస్థ 6 నెలల క్రితం ఏర్పరచబడి, 400 రూ. లోబడిన నెల ఆదాయం గలవారికి వైద్య సహాయమూ, అనారోగ్యం వాతబడిన వారికీ అంగవైకల్యంపొందిన వారికీ, ధనసహాయమూ గర్భవతులకూ, బాలింతలకూ రోజుకు 10 అణాల వంతున 3 నెలలపాటు ధన సహాయమూ చేస్తుంది.

నేడు ప్రారంభించబడిన వైద్యసహాయకసమితి భీమాచేయబడిన వ్యక్తులకు వైద్య సహాయపు ఏర్పాటులు కల్పించి నిర్వహిస్తుంది. దీనికి గాను ప్రభుత్వభీమా సంస్థతోబాటు రాష్ట్ర ప్రభుత్వాలు కూడా కృషిచేస్తవి. నిర్వాహణఖర్చులో మూడో వంతు ప్రభుత్వాలపై పడుతుంది. పనివారికి మందులు అందుబాటులో ఉంచడమూ, ఆసుపత్రి సౌకర్యాలు ఏర్పరచడమూ రాష్ట్రప్రభుత్వాల పని.

మొట్టమొదట్లో రోగులకు ఆస్పత్రులలో వసతి సౌకర్యాలుండవనీ, వైద్యులు రోగుల ఇళ్లకు వెళ్లిరావడానికిమాత్రమే వీలు కల్పించబడతవనీ, ఈ సంస్థ సరిగా అభివృద్ధి చెందినట్లయితే ప్రజలందరికీ కూడా, డబ్బు ఇచ్చినా ఇవ్వకపోయినా వైద్యసహాకారం అందే అవకాశం ఉండనీ, ఈ ఆదర్శం సఫలం చేయడానికి ఎంత శ్రమ అయినా పడదగినదే ననీ అమృతకౌరు చెప్పారు.

వైద్యసహాకారసమితివారు వైద్యులకు జీతా లిచ్చి నియమించి ప్రయివేటు ప్రాక్టీసు లేకుండా ఏర్పాటు చేయాలా, లేక ప్రైవేటు ప్రాక్టీసు చేసుకొనే వైద్యులను ఉపయోగించుకోవాలా అనే విషయం ఆలోచిస్తారు.

# కేంద్ర ట్రాక్టరు సంస్థ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 20: ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థకు డైరెక్టరు జనరలు గాపనిచేసిన లార్డు బోయిడ్-ఆర్ వ్యవసాయశాఖవారి కేంద్రట్రాక్టరు సంస్థను సందర్శించాడు. ఈసంస్థకు అధ్యక్షుడైన సేకే ఆయనకు కర్మాగారమంతా చూపి, ఈసంవత్సరం 180 ట్రాక్టర్ల సహాయంతో లక్ష ఎకరాల బంజరుసాగులోకి రానున్నదనీ, యిప్పటికే 40 వేల ఎకరాలు సాగు అయినవనీ తెలిపాడు. లార్డు బోయిడ్-ఆర్ ఈ సంస్థచేసే పనిలో చాలా ఆసక్తి కనబరిచి ఎంత భూమి సాగుకు లభ్యంగా ఉన్నదీ, ఎటువంటి నేల అయినదీ, ఎంత సర్వం ఖర్చు అవుతుందీ విచారించి సంస్థను అభినందించాడు.

# చెన్నపట్నం లేకుండా రాష్ట్రానికి ఒప్పుకోరాదు

## చిత్తూరుజిల్లా కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

మదనపల్లి, ఏప్రిల్ 20: చెన్నపట్నం లేకుండా రాష్ట్రం ఏర్పాటుకు ఆంధ్రులు అంగీకరించరాదని చిత్తూరుజిల్లా కాంగ్రెసు కార్యవర్గం కప్పంలో సమావేశమై తీర్మానించారు. సమావేశానికి ఆర్. వెంకటరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

మదనపల్లి యువజన సంఘ కార్యవర్గంవారు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై నాయకత్రయ సంఘ నిర్ణయానికి అనంగీకారం తెలుపుతూ, ఆంధ్రులు ధనిష్ఠ్యత్తు ప్లెబిసైట్ ద్వారా నిర్ణయించాలని సూచిస్తూ ఒక తీర్మానం చేశారు. నా. త్ర. సంఘ నిర్ణయం అంగాలు లేని మొండెంవలె వున్నదని వారు అభిప్రాయం తెలుపుతున్నారు. (అ. ప్ర)

# ఆంధ్రమహిళా బేసిక్ విద్యాకేంద్రం

తిరువూరు, ఏప్రిల్ 19: ఇచ్చటిఆంధ్ర మహిళా బేసిక్ విద్యాకేంద్రంలో 1949 జూలైనుండి జూనియర్ బేసిక్ ట్రేడ్ ట్రయినింగు పొందగోరు విద్యార్థినులు, తమ దరఖాస్తులను మే 15 లోగా స్కూలు ప్రధానోపాధ్యాయినికి పంపవలెనని వ్యవస్థాపకురాలు శ్రీమతి దమయంతిగారు వ్రాశారు. వివరాలు తెలుసు కొనగోరువారు దమయంతిగారిపేర తిరువూరు వ్రాయవచ్చు.

# గుంటూరు ఐ.యన్.టి.యు.సి. జాతీయ కార్మికసభ

గుంటూరు, ఏప్రిల్ 19: స్థానిక ఐ. యన్. టి. యు. సి. జాతీయ కార్మికసభ గోగినేని లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన జరిగెను. సభకు 1200 మంది స్త్రీపురుషులు హాజరైరి. నడింపల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు సభను ప్రారంభిస్తు కార్మికులకనీసపు వేతనాలను, యీలాంటి సంఘాలు స్థాపించుకొని శాంతియుత మార్గాన సాధించుకొనుట అవసరమనిరి. అధ్యక్షుడు స్వాతంత్ర్యముతోపాటు ప్రభుత్వము అనేక క్లిష్టసమస్యల నెదుర్కొనవలసినందున కార్మికుల అభివృద్ధికి తగిన అవసరచర్యలు తీసుకొనలేకపోయిందనియు, ప్రస్తుతము వీరిఅభివృద్ధి కవసరచట్టాలు చేయుచున్నారు కనుక ఓరిమి వహించవలెనని నుడివిరి.

బాచిన సుబ్బారావు, పలకలూరి నారాయణ, యం. డి. దత్తు తదితరులుపన్యసించిరి. కార్యవర్గసభ్యుల యెన్నికతో సభ ముగిసెను.



మహాత్మాగాంధి జాతీయ స్మారకనిధి వసూళ్లకై ఏర్పడిన పారిశ్రామికులసంఘం అధ్యక్షుడు కస్తూర్భాయ్ లాల్భాయ్, ఆ సంఘం వసూలుచేసిన 5 కోట్ల రూపాయల చెక్కులను స్మారకనిధి మరొక్క కేంద్ర సంఘాధ్యక్షుడు బాబూ రాజేంద్రప్రసాద్ గారికి ఏప్రిల్ 15 న సమర్పించినప్పటి దృశ్యం.

# ఐరిష్ రిపబ్లిక్‌తో బ్రిటన్ సంబంధాలు

## కామన్వెల్తు వ్యవహార శాఖ వారే చూస్తుంటారు

లండన్, ఏప్రిలు 19: ఐరిష్ రిపబ్లిక్‌తో బ్రిటన్ సంబంధ బాంధవ్యాలన్నింటిని బ్రిటిషు కామన్వెల్తు వ్యవహార శాఖ వారే చూస్తారు; అంతేగాని యీపని బ్రిటిషు విదేశాంగశాఖకు బదిలీచేయబడదు అని బ్రిటిషు విదేశాంగ శాఖోద్యోగి ఒకడు నొక్కిచెప్పాడు.

డబ్లిన్‌లో బ్రిటిష్ ప్రతినిధి సర్ గిల్బర్ట్ లెయిత్‌వైట్ బ్రిటిష్ ప్రతినిధిగానే ఉంటాడుగాని మంత్రిహోదాలో బ్రిటిష్ రాయబారి కాడు." అని గూడ యీయన అన్నాడు.

నిన్న టీరోజున సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా మారిన ఐర్ ప్రభుత్వంతో బ్రిటన్ వ్యవహారాలను, యింకా కామన్వెల్తు శాఖవారే ఎందుకు నిర్వహిస్తుంటారు అని ప్రశ్నించగా సమాధానం చెప్పుటకు యీయన నిరాకరించాడు. క్రిందటిరోజు బ్రిటన్‌తో సంబంధాలను విచ్ఛేదించుకొన్నప్పుడు ఐర్లాండ్ ఇంగ్లాండ్‌ల వ్యవహారాలన్నీ విదేశాంగ కార్యాలయానికి బదిలీచేయబడెవని

# ఎనిమిది మాసాల్లో రాష్ట్రం

## శాసనసభ ఆంధ్రసభ్యుల సభలో రాష్ట్రపతి డా. పట్టాభిగారి సూచన

### ప్రకాశంప్రభృతులు సమావేశానికి హాజరుకాలేదు

మదరాసు, ఏప్రిల్ 20: ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు ముందు తీసుకొనవలసినచర్యలుగురించీ రేపు జరుగనున్న కాంగ్రెస్ శాసనసభాపక్షసమావేశములో ప్రతిపాదించవలసిన తీర్మానముగురించి చర్చించుటకు నేటిసాయంత్రము ఆంధ్ర శాసనసభ్యుల సమావేశము "శుభోదయ" భవనములో జరిగెను. శ్రీ పి. యల్. యన్. రాజుగారు అధ్యక్షతవహించిరి.

రాష్ట్రపతి నాయకత్రయ నివేదికను వివరించుచు ఆంధ్ర రాష్ట్రము తక్షణమే నిర్మాణము గావలెనంటె ఆంధ్రులు మదరాసుపై తమకుగల హక్కులు వదలుకొనవలసి వుంటుందని ఆపక్షములో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము ఎనిమిదినెలలలో జరుగ వచ్చని తెలిపినట్లు తెలియుచున్నది.

తీర్మానములో పరిహద్దులను సూచించుట మంచిదనియు తమిళులు చిత్తూరు జిల్లాను కోరుచున్నారనియు లెజిస్లేటివు కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు సూచించగ అధ్యక్షులు రాష్ట్ర విభజన జరుగునప్పుడు హద్దుల నిర్ణయ కమిటీ ఏర్పడుననియు వారు నిర్ణయము చేయగలరనియు హద్దులను ఉదహరించుట వలన అనేక చిక్కులు కలుగవచ్చుననియు చెప్పినట్లు తెలుస్తుంది.

శ్రీ కాశీశ్వరరావుగారు ప్రస్తుతము ఆంధ్రకాంగ్రెసు ప్రాంతమునే రాష్ట్రముగ చేయవచ్చని సూచించిరి.

సభకు షుమారు 40 మంది శాసన సభ్యులు వచ్చిరి. శ్రీ ప్రకాశం పంతులుగారు, వెన్నేటి విశ్వనాథముగారు మొదలగు ప్రముఖ ఆంధ్ర శాసనసభ్యులు కొందరు సమావేశమునకురాలేదు.

# మద్రాసు మంత్రివర్గంలో మార్పులు

## కోయంబుత్తూరు ప్రజలకు సంతానంగారి హెచ్చరిక

కోయంబుత్తూర్, ఏప్రిల్ 19: — "మద్రాసు మంత్రివర్గంలో ఎపుడైనా యీ మార్పులు జరగటంవల్ల సరిగా పరిపాలన సాగటం దుర్లభం. ఈ మార్పులు మీకు ఇష్టంలేకపోతే మీరు ఆ విషయం రిపోర్టు చేయండి కాంగ్రెస్ సంఘం వారికి గాని, కాంగ్రెసు సెంట్రల్ పార్లమెంటరీ బోర్డు వారికిగాని ఆ విషయం తెలియజేయవచ్చు.

ప్రజాభిమానాన్ని వారు చూపాలి ప్రస్తుత నాయకత్వంలో ప్రజలకు విశ్వాసం లేకపోతే ఎన్నికలవారిని తొలగించి క్రొత్తవారిని ఎన్నుకోవచ్చును" అని, కోయంబుత్తూరులో జరిగిన ఒక బహిరంగసభలో, కేంద్రశాఖామంత్రి కె. సంతానం ప్రజలను హెచ్చరించారు.

# ఇతర హిట్లరు డా. మలాన్

## లండన్‌లో ప్రతికూల ప్రదర్శనలు: విగ్రహ విధ్వంసన

లండన్, ఏప్రిల్ 21: లండన్‌లోని భారతీయ విద్యార్థులు, ఆఫ్రికా విద్యార్థులు, వలసదేశాల విద్యార్థులు నిన్నరాత్రి దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ డేనియల్ మలాన్ మకాంచేసియున్న లండన్ హైడ్ పార్కు హోటలు ముందు "మలాన్ నశించాలి", "మానవాధిక్యతకూనికి మలాన్ నీకపురుషు" అని కరపత్రములు పంచి ప్రతికూల ప్రదర్శనలు జరిపారు. మలాన్ బొమ్మ, స్వస్తికసూత్రంతో అలంకరించబడిన ఒకమోటారు ఆ హోటలుముందు అనేకసార్లు తిరిగింది విద్యార్థులుహోటల్‌వద్ద చేరగానే స్పెషల్ పోలీసులుకూడ అక్కడకు చేరారు హోటలులోని అతిథులు బాల్కనీలలోకి రాగానే హోటలుకు ఎదురు గావున్న హైడ్ పార్కు విద్యార్థులు నిలబడి "మలాన్ పచ్చిఫాసిస్టు, జాతివిద్వేషి. ప్రపంచశాంతికి మలాన్ వేరుపురుగు. మలాన్‌ను బ్రిటన్ లోరాకుండ ఆపివేయాలి. మలాన్! స్వాగతం చెప్పించుకో!" అని కేకలువేశారు. పోలీసులు ప్రదర్శకులకార్డ కొంతమంది పేర్లను వ్రాసుకొని దీనికి ఏదైనా సంఘం యొక్క మద్దతువున్నదా అని విచారణ చేసిరి. దీనికి ఏ సంఘంయొక్క తోడ్పాటులేదని వారికి తెలియజేయబడింది. ప్రదర్శన శాంతియుతంగా జరిగిపోయింది.

# మలాన్ ప్రతిమను దగ్ధంచేసే యత్నం

లండన్, ఏప్రిల్ 21: లండన్‌లోని భారతీయ విద్యార్థులు, ఆఫ్రికన్ విద్యార్థులు, వలస దేశాల విద్యార్థులు గతరాత్రి దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ డేనియల్ మలాన్ బొమ్మను ట్రెఫాల్గర్ స్క్వేయరులో తగులబెట్టుటకు ప్రయత్నించగా పోలీసులు ఆపివేశారు.

# నగరములో బ్రిటిష్ విగ్రహములు

## తొలగించే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు

మదరాసు, ఏప్రిల్ 18: మదరాసు నగర రాజవీధులలో బ్రిటిషువారి విగ్రహములు 9 వున్నవి. 1. ఏడవ ఎడ్వర్డురాజుది, మౌంటురోడ్డులో గవర్న మెంటు భవనము వద్ద కలదు. 5 వ జార్జిరాజు ప్రతిమలు 3 ఒకటి నేతాజీరోడ్డులోను, రెండవది పార్కు టౌను లార్డ్ మార్ఫన్ జావుంటు రోడ్డులో వారద్దిలాంగు కంటోనద్దకలదు. ప్రాణ్యము మదరాసు గవర్నరు ఇంద్రకూ మైసూరుయి లార్డ్ వెల్లింగ్‌టన్ విగ్రహమున్నూ సర్ థామసు మన్రో విగ్రహమున్నూ మౌంటు రోడ్డులో పున్నవి. సర్. ఆర్థర్ హావ్‌లాక్ విగ్రహము నేతాజీరోడ్డులో వున్నది. జస్టిస్ బాష్యం విగ్రహము హైకోర్టులోను, డా॥ అనిబిసెంటు విగ్రహము బీసెంటురోడ్డులోనూ వున్నవి. 1939 లో నీల్ విగ్రహము తొలగించి మ్యూజియములో పెట్టినారు. ఈ విగ్రహములలో దేనినిగాని తొలగించు ఉద్దేశ్యము ప్రభుత్వమునకు ఇప్పట్లో లేదని తెలియుచున్నది.

# కొమింటాంగ్ సంధి ప్రతిపాదనలు

## కమ్యూనిస్టు నిరాకరణ

నాన్‌కింగ్, ఏప్రిల్ 21: సంధికై నాన్‌కింగ్ ప్రభుత్వం సూచించిన ఎదురు ప్రతిపాదనలను కమ్యూనిస్టులు నిరాకరించారన్న వార్తను చైనా అధికారవర్గములవారు ధృవపర్చారు. తమతో సమముగా భావించి, యుద్ధవిరమణకు సమ్మతించవలసినదిగా అధ్యక్షుడు లీసుంగ్ జెన్ ప్రధాని హోయింగ్ చిన్ కమ్యూనిస్టులకు విజ్ఞప్తి చేశారు.

యాంగ్సీనదిని కమ్యూనిస్టులు దాటితే ఏవిధంగా ప్రతిఘటించాలో, అందుకేమేమి చేయాలో, తెలుసుకొనేనిమిత్తం అధ్యక్షుడు లీజెన్ యీమధ్యాహ్నం జనరలిసిమో చంగ్ కై షేక్ కడకు వెళ్ళవచ్చునని ధృవపడని వర్గాలద్వారా తెలుస్తున్నది.

ప్రభుత్వకౌన్సిల్‌లో ప్రధానమైన ఐదుగురు అధ్యక్షులు యీవేళ మధ్యాహ్నం నాన్‌కింగ్‌లో సమావేశమై, ప్రభుత్వాన్ని కాంటనుకు మార్చాలనినిశ్చయించారు 600మంది శాసనసభ్యులలో సగంమంది యీరాత్రి విమానంలో కాంటన్‌కు బయలుదేరుతారని మరిమొక ధృవపడని వార్త తెలుపుతున్నది.

# గాంధిజీ వీలునామా

## నరహరి పరీఖ్ దరఖాస్తు విచారణ

అహమ్మదాబాదు, ఏప్రిల్ 21 మహాత్మాగాంధీ వీలునామాలో ఆయన రచనల కాపీరైటును సంబంధించినంతవరకూ ప్రొబేట్ (ప్రమాణం) కావలెననికోరుచు నరహరి పరీఖ్ పెట్టిన దరఖాస్తుపై నేడు అహమ్మదాబాదు జిల్లా కోర్టులో విచారణ జరిగినది. ప్రొబేటుకు అభ్యంతరము లున్నచో తెలుపవలసినదని జారీ చేయబడిన నోటీసుకు సమాధానం కోర్టువారికి యింకా చేరనందున విచారణ మే 5 వ తేదికి వాయిదా వేయబడెను.

మహాత్మా గాంధీ చనిపోయిన ఢిల్లీలో జిల్లాకోర్టువారికి ఈ అభ్యంతనములు పంపబడవలెనని ప్రకటించబడినది.

ప్రొబేట్ దరఖాస్తుపై ఎంతఖరీదు స్టాంపులు అంటించవలెనో నిర్ణయించే యుటకు వీలుగా గాంధీజీ రచనల కాపీరైటు విలువ 10 వేల రూ. లని అహమ్మదాబాదు కలెక్టరు నిర్ణయించెను.

# తూర్పు పంజాబ్ ప్రభుత్వంలో డిప్యూటీ మంత్రి పదవులు రద్దు

సిమ్లా, ఏప్రిల్ 21: తూర్పుపంజాబు ప్రభుత్వంలో యిటీవల నియోగింపబడిన డిప్యూటీ మంత్రుల పదవులు రద్దుచేయబడునని, పార్లమెంటరీ కార్యదర్శుల నియామకం జరుగునని తెలియుచున్నది. కేంద్ర పార్లమెంటరీ బోర్డు నిర్ణయం ప్రకారం డిప్యూటీ మంత్రిపదవులు రద్దవును. ఇప్పుడున్న ఆరుగురు డిప్యూటీ మంత్రులు రాజీనామా యివ్వవలసినదిగా కోరబడిరి.

జమీందారీ రద్దుచట్టం

మదరాసు జమీందారీ రద్దుచట్టమునకు గవర్నరు జనరలుగారు అనుమతించినట్లు శాసన మయినట్లు 23 వ తేదీ గెజెటులో ప్రకటించబడెను.

# రేడియో కార్యక్రమాలు

## వార్తల వేళలు, మీటర్లు

ఆలిండియా రేడియోనుంచి రోజూ ఉదయం 7.0 గం. కు మధ్యాహ్నం 1.50 గం. కు సాయంకాలం 7.0 గం. కు తెలుగులోనూ, ఉదయం 8.0 గం. కు మధ్యాహ్నం 1.30 గం. కు సాయంకాలం 6.0 గం. కు రాత్రి 9.0 గం. కు ఇంగ్లీషులోనూ వార్తలు, ప్రచారం చేస్తారు. ఈ వార్తలను 211.3, 31.28, 357.1 మీటర్లలో వినవచ్చు.

ప్రతిరోజూ ఉదయం 8.15 మధ్యాహ్నం 1.40కి మదరాసు (1) లోనూ, మధ్యాహ్నం 2.45 మదరాసు (2) లోనూ, సాయంత్రం 7.30 విజయవాడలోనూ సినిమాపాటలు మొదలైనవి ప్రసారం చేస్తారు.

సాయంత్రం 6.10 మదరాసు, విజయవాడ రెండు కేంద్రాలనుంచి స్థానిక వార్తలు, ధరలువగైరా ప్రకటిస్తారు.

## సంగీతాది కాలక్షేపాలు, ప్రసంగాలు మొదలైనవి

### ఏప్రిల్ 23 వ తేదీ

మదరాసు 1: ఉదయం 7.30 ఎల్. ఎస్. గంగ, టి. వి. సీతలగాత్రం సాయంత్రం 5.30 సి. వి. యజ్ఞనారాయణ్ వీణ. 7.30 సంకజ్ మల్లిక్ పాటల రికార్డులు. 7.45 ముసిరి సుబ్రహ్మణ్యఅయ్యర్ కచేరి, రాత్రి 9.15 'పారిశ్రామికాభివృద్ధికి మద్రాస్ ప్రభుత్వ పథకాలు' గురించి కె. జి. మీనన్ ఇంగ్లీషు ప్రసంగం.

మదరాసు 2: ఉదయం 7.15 ఎస్. వి. పార్థసారథి గాత్రం. 8.30 బాలానందం, నిర్వహణ: న్యాయపతి కామేశ్వరి. సాయంకాలం 6.30 నుంచి 7.0 వరకూ, 7.15 నుంచి 7.30 వరకూ గ్రామస్థుల కార్యక్రమం — 'నూతన రాజ్యాంగంలో కేంద్ర మంత్రివర్గం, యాత్రాస్థలములు అనే శీర్షికను 'చిదంబరం' గురించి ప్రసంగాలు.

విజయవాడ: ఉదయం 7.15 పొంమూరి వేంకటేశ్వరరావు గీతావళి. 7.30 అంబటిపూడి శ్రీరామమూర్తి వైలన్. 8.15 శ్రీరామమూర్తి వైలన్. సాయంత్రం 5.30 బొమ్మరిల్లు. పిల్లల కార్యక్రమం. సాయంకాలం 6.20 వెంకటేశ్వరరావు పాటలు. 6.30 గ్రామస్థుల కార్యక్రమం. మద్రాస్‌నుంచిరిలే. 7.30 ఉభయ కుశలోపరి.

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 21:

వేరుసెనగ: (531 పౌ 2-కి ఎద్దు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు(కొత్తది) రు. 170-0-0

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 389-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్సుపెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | | |
|---|---|---|
| మొదటి రకం | రు. | 350-0-0 |
| రెండవ రకం | రు. | 310-0-0 |

కొంకాయనూనె (39 పౌను గల డబ్బా) ఒకటికి రు. 33-2-9

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 74-6-0 పెట్లా బంగారు తులం 114-0-0 నూసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 180-0-0 వెండి తులం 1 కి 1-13-0.

పంచదార

| | | |
|---|---|---|
| "కాన్పూరు" (2 అందరు) | రు | 90-0-0 |
| అనకాపల్లి" (2 అందరు) | | 89-4-0 |

# న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 20.

మే వాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వెల | 32.19 |
| | నిన్న | | 32.08 |
| ,, | ముగింపు | వెల | 32.19 |
| | నిన్న | | 32 19 |

# కెన్నెత్ రాయల్ రాజీనామా

## ట్రూమన్‌కు అందచేయబడింది

న్యూయార్కు, ఏప్రిల్ 19: అమెరికా సైనికశాఖా కార్యదర్శి, కెన్నెత్ రాయల్ తన రాజీనామా పత్రాన్ని ట్రూమన్ అధ్యక్షునికి అందచేసినట్లు, న్యూయార్క్‌లోని 'డెయిలీ న్యూస్' పత్రిక యీవేళ ప్రకటించింది.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras